# మనవి

విశ్వవిఖ్యాతుఁడైన పండితరాయల చరిత్ర సమగ్రముగ లభించుటలేదు. చారిత్రకాధారములఁ బరిశీలించి, యొకవిధమైన కథాస్వరూపము నేర్పఱచుకొని యీ గ్రంథమును రచించితిని. ఇందలి యంశము లేవియుఁ జరిత్రకు భిన్నములు కావు. కవి, పండితుఁడు, వీరుఁడు, సంస్కృత, ఆంధ్రప్రతిభను భరతఖండమం దంతటను జాటిన మహామహుఁడగు జగన్నాథుని చరిత్రకు నొక స్వరూపమొసఁగి, యను రత్వ్యముఁ జేకూర్చుటయే నా తలంపు. ఇందు నే నెంతవఱకుఁ గృతకృత్యుఁడ నైనది నిర్ణయింపఁ దగువారు పాఠకులు.

రచనలో నూత్నవిధాన మవలంబించితిని. కథతోఁబాటు, నాఁటి భారతదేశ చరిత్ర—సంఘము—సంస్కృతి—సాంప్రదాయములు పాఠకులకుఁ దెలియునట్లు చేయఁ బూనుకొంటిని. ఇది కత్తిమీఁది సామువంటిది.

ప్రభుత్వ విద్యాశాఖవారు, పండితులు నా యీ గ్రంథముఁ బ్రోత్సహింప వేఁడికోలు.

కర్నూలు,
24-11-49.

ఇట్లు,
రచయిత.

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము

# వీరకంకణము

## ప్రథమాధ్యాయము

### ౧

శ్రీ కృష్ణదేవరాయల భువనవిజయము విశాలమై, సమచతురస్రముతో నొప్పారుచున్నది. భవనమంతయుఁ జాలజాతితో నిర్మింపఁబడి, బంగరు రేకుల నతికింపఁబడిన కుడ్యములతో విలసిల్లుచుండును. రత్నముల ముగ్గులు దీర్చి యున్నారు. వివిధ సైనిక వ్యూహములు, మృగయావినోద దృశ్యములు, మల్లయుద్ధ ప్రదర్శనములు, రాయ బారుల ప్రతిమలును జీవకళ లుట్టిపడునట్లు కుడ్యములఁ జిత్రింపఁబడి యుండెను. భవనము శిల్పకళా మహాత్తును నోఁచుకొన్నది. అంతఃపుర కాంతలకై ప్రగ్రీవము కలదు. ఆ స్థానమందుఁ బ్రదర్శితములగు వినోదముల నవరోధవ్రాత మితరుల కంటఁ బడకుండఁ జూచుటకు యోగ్యముగ నున్నది. భవన మధ్య ప్రదేశమున శిల్పకళావైభవమునఁ దీర్చి దిద్దఁబడిన సింహాసనము. అందు శ్రీ కృష్ణదేవరాయ లధిష్ఠించును.

ఆ యాస్థానమున వీరులకు, కవులకు, గాయకులకు, సామంతరాజులకుఁ బ్రత్యేకించి స్థానము లేర్పరుపఁ బడినవి. 'చౌషష్టి' కళలకు నచట గౌరవమె. అందు వీరలక్ష్మి సర్వదా విహరించుచుండును. కవితాకన్య తన మధుర

మోహనవాక్యములచే సభ్యుల నానందాబ్ధి నోలలాడించు చుండును. సంగీతసరస్వతి తన గానకళావైదగ్ధ్యమున నచటి రసికబృందమును ముగ్ధులఁ గావించుచుండును. ఒకవైపు కళలకు, వేఱొకవైపు వీరసంపదకు నది పుట్టినిల్లు. రాయల కళాప్రియత్వము, వీరశౌండిమ విశ్వవిఖ్యాత. దానికి గీటు ఱాయి భువనవిజయము. ఆంధ్ర కర్ణాటక సామ్రాజ్యమున కదియె కూడలి. దేశభాషాభివృద్ధి కా భవనమె మూల కందము.

కర్ణాటాంధ్రక్షమావల్లభ, బహుపరాక్ !
సంగీతసారస్వతప్రియా, బహుపరాక్ !
భాషాపోషణ ధురంధరా, బహుపరాక్ !
మూరురాయరగండాది బిరుదాంకితా, బహుపరాక్ !
తిరుమలాంబా మనోనాయకా, బహుపరాక్ !
అష్టదిగ్గజకవిభూషితా, బహుపరాక్ !
మహాంధ్రసార్వభౌమా, బహుపరాక్ !

ఇట్లు కైవారములు చదువుచుందురు. పురోహితులు కలశజలసమ్మార్జనముఁ గావించుచుఁ బోవుచుండ, సేవకులు మార్గ మాదేశింప ముందు నడచుచుండఁగా భువనవిజయ సింహద్వారములో శ్రీ కృష్ణదేవరాయ లడుగుపెట్టెను. అతని వెనుక మంత్రులు, సామంతరాజులు, కవులు, పండితులు మొదలగువారు నడచిరి. సభాసదులు పుష్పములు విరియఁ జల్లుచుండ సింహాసనము రాయ లధిరోహించెను.

వేదవిదులు మంత్రాశీస్సులఁ గావించిరి. శాస్త్ర పండితులు మంగళశ్లోకములఁ జదివిరి. కవు లాశీఃపద్యముల నాశుకవితతోఁ జెప్పిరి. రాయల కనుసన్నతో సభ నిశ్శబ్ద మయ్యెను. ఎల్లరు నుచితాసనాసీనులైరి.

రాయలు సింహాసనమునుండి లేచి సగౌరవపురస్సరముగా సభకు నమస్కరించి, "నేఁ డేలకో నా హృదయ మానందభరితమైనది. మీ కందఱకు నొక విజ్ఞాపనము చేయవలెనని నా యుబలాట. కటకమును మొదలు కన్యాకుమారి వఱకుఁ గల దేశమును జయించి యాంధ్ర కర్ణాటక సామ్రాజ్యమును స్థాపించితిని. ఇందులకు దేశవాసులు చూపిన సాహసౌదార్యములు శ్లాఘనీయములు. మీ ద్వార వారికి నా ధన్యవాదములు సమర్పించుచున్నాను. మన సామ్రాజ్యమును గోదావరిని దాఁటి విస్తరింపఁ జేయవలయు ననెడి యూహ నాలోఁ బొడమినది. ఇందులకు మీ రెల్ల బూనుకొనవలెను. నా యుద్దేశ్యమును మీ రపార్థము చేసికొనఁ గూడదు. క్షాత్రధర్మమునకు రాజ్యకాంక్ష సముచితము. వీరునకు యుద్ధాపేక్ష స్వభావసిద్ధము. ఆంధ్ర సంస్కృతికి భారతదేశమం దంతట జేజేలు పెట్టించుటయె నా యభిమతము. ఈ విషయమై సభ్యుల సలహాలను ప్రార్థించుచున్నాను." అని యుపన్యాసమును ముగించెను.

ఒక భటుఁడు ప్రవేశించెను. సభాస్తారులెల్ల నతనివైపె చూచుచుండిరి. వినయవినమితాంగుఁడై "దేవా! గోదావరి నివాసియఁట. ఒక బ్రాహ్మణుఁడు సభాప్రవేశ

మర్దించుచున్నాఁడు. దేవరవారి యాజ్ఞ" అని భటుఁడనఁగా "వెంటనే ప్రవేశపెట్టు" మని రాయలనెను. సేవకుఁడు వెళ్ళి యాబ్రాహ్మణుని సభలోనికిఁ బ్రవేశపెట్టెను.

రాయ లాబ్రాహ్మణునకు మోకరిల్లి, యుచితాసనా సీనుఁగావించి, "మహానుభావా! తమ నివాసస్థల మెద్ది? తమ కేయేవిద్య లభ్యస్తములు? తమ రాకకుంగల కారణ మేమి?" అని ప్రశ్నించెను.

దివ్యతేజోద్దీప్తమైన యాబ్రాహ్మణుని ముఖము, స్ఫురద్రూపము సభ్యులకుఁ గలవరపెట్టెను. పండితులు, కవులు, గాయకులు నాతనిఁగూర్చి తెలిసికొనుట కాతురత పడుచుండిరి. ఆబ్రాహ్మణుఁడు నమస్కరించి, "ఆంధ్ర సార్వభౌమా! నేను గోదావరీప్రాంతమునంగల ముంగొండ నివాసిని. రాజుల దర్శించుచుఁ దమ దర్శనార్థము వచ్చి నాడను. మీ యాస్థానము కళలకుఁ గాణాచి. పండితాదరమునకుఁ బ్రసిద్ధి. నేను శాస్త్రోక్తమైన నాట్య సంగీతములఁ గొంతవఱకుఁ బేరెన్నికఁగన్న విద్వాంసుఁడను. నా కళాకౌశలముఁ జూడ వేఁడికోలు. అనుగ్రహింపుఁడు" అని వినయ విధేయతలు పలుకులఁ దళుకొత్తఁ బ్రార్థించెను.

"అంతటి మహాభాగ్యము గలిగినందులకు మే మెంతయో సంతోషించుచున్నాము. ఎదురుగనున్న ప్రదర్శనశాలలో వేషాది పరికరము లున్నవి. తామందుఁ బ్రవేశించి, త్వరలో మాకనులపండువు గావింతురని తలంతును," అని కృష్ణదేవ

రాయలు పలికెను. ఒక సేవకుఁ డా బ్రాహ్మణుని ప్రదర్శన శాలలోనికిఁ గొనిపోయెను.

కొన్ని నిముసములలో నంతఃపుర స్త్రీలందఱు ప్రగ్రీవముం జేరిరి. సభలోఁ గలవారెల్లరు నాట్యదర్శన కుతూహలముతో నొకరితో నొకరు గుసగుసలాడుచుండిరి. భవనమంతయు మర్మరధ్వనితో నిండెను. కొందఱు రాయల కళాప్రియత్వముం గొనియాడుచుండిరి. ఎందుకన తీవ్ర రాజకీయ విషయములనుగూర్చి మాట్లాడు సందర్భమున వచ్చిన బ్రాహ్మణునకుఁ గళాప్రదర్శనమున కనుమతించుట. సభ కొంతసేపటికి నిస్తరంగ సముద్రమువలె నయ్యెను.

యవనిక తొలఁగింపఁబడినది. రాధవేషము. జయదేవుని గీతగోవిందములోని యష్టపదితో నాట్యము ప్రారంభమైనది. ఆకనుల కదలికలో, పెదవుల వణఁకులో, శిరఃకంపనములో, ముఖములో ప్రతిఫలించు హావభావములలో, హస్త సంకేతములలో, పాదముల లయాప్రస్తారములలో నద్భుత నాట్యకళా ప్రభావము ముప్పిరిఁ గొన్నది. 'భరతుని శాస్త్రమున కతఁడె వ్యాఖ్యాత,' అని చెప్పఁదగినట్లు శాస్త్రోక్త నాట్యభంగిమ లాయనలో సాక్షాత్కరించినవి. సభ్యులు శృంగారరసములో నైక్యమైనారు.

కొంతకాలము యవనిక జాఱి, మఱల యెత్తఁబడెను. ఆభయంకరాకారమె రసావిర్భావముఁ గలిగించిన దనవచ్చును. అది కలితాండవము. హాహాకారములు

సభలో సంచలనముఁ గలిగించినవి. కలిలో కనిపించు హింస, దౌర్జన్యము, మాయ, ద్వేషాదు లానృత్యములో ప్రస్ఫుటించుచుండెను. చూపఱ శరీరములు పులకరించినవి. అద్భుతరస మందఱను మంత్రముగ్ధులను గావించెను. అంతః పుర కాంతల వెంబడిఁ జూడవచ్చిన శిశువు లాభయంక రాకారమున కాక్రందించిరి. రాయలు ముక్కుమీఁద వ్రే లిడుకొనెను. యవనిక జాఱుటతోడనె సభలో మఱల కలకలము.

శ్రీకృష్ణదేవరాయలు నటుని సమ్మానింప నాయత్త పఱచెను. కొన్ని నిముసములలో నా బ్రాహ్మణుఁడు యథా పూర్వ వేషమున రాయలసన్నిధి కేతెంచుచుండఁగా నెదు రేఁగి యభివందన మాచరించి, తన సింహాసనము చెంతకుఁ దీసికొనిపోయి కూర్చుండఁబెట్టి "నాట్యకళాధురీణా! నేఁటికి నా జన్మ ధన్యమైనది. ఇట్టి నాట్యము నా జీవితములో నదృష్టపూర్వము. మీ గ్రామమును మీ వంశపారంపర్య ముగ ననుభవించుటకు నగ్రహారము నొసంగితిని. అంతకన్న నుత్తమ బహుమాన మీయవలయునని నాతలంపు. రాయ చూరు దుర్గ విజయానంతరము ప్రజలు నా కొసఁగిన వీర కంకణమును తమకు బహూకరించుచున్నాను. ఇయ్యది నవ రత్నఖచితము. స్వీకరించి నా కళాప్రియత్వమును సార్థకముఁ గావింపుఁడు," అని తన చేతనున్న కంకణము నొసంగెను. ఆ బ్రాహ్మణుఁడు సంతోషితాంతరంగుఁడై, "తమ కళా పోషకత్వము యుగయుగముల కాదర్శమగును గాక! నన్ను

బహూకరించవలసిన దానికంటె నెక్కువగనె బహూకరించి తిరి. అంతియెచాలు. తమవంటి మహారాజులె లేకున్న నాంధ్రదేశములో కళాసంపదకు నిలువ నీడయుండునా? సమస్తకళలు మీ యాదరాభిమానములచేతనే దినదినాభివృద్ధి నందుచున్నవి. మహాప్రసాదము,'' అని వీరకంకణముఁ గన్నుల కొత్తుకొనెను. "నేఁటి కీసభ సమాప్తమైనది,'' అని రాయ లనఁగా సభ్యులెల్ల రత్యుత్సుకులై యాబ్రాహ్మణుని వైపు తదేక దృష్టితోఁ జూచుచు వెళ్ళిపోయిరి.

---

౨

విజయధుందుభులు మ్రోఁగినవి. రోదోంతరము ప్రతిధ్వనించెను. దిక్కులు పిక్కటిల్లినవి. బాజా భజంత్రులు, పటహకాహళకాద్యనేక వాద్యవిశేషము లొక్కుమ్మడి ధ్వనింపసాగెను. విశ్వమును జాగృతిపఱచు నవోదయ సూర్యబింబమునకు దేవతలెవరో మంగళవాద్యములు సల్పుచున్నారాయని గ్రామాంతరప్రజలు విభ్రమముగ నాకాశవీథిఁ దిలకించుచుండిరి. వారల కగమ్యగోచరముగ నుండెను.

భేరీ భాంకారములఁ గావించుచు జనము ముందు నడచుచుండిరి. సఖడ్గపాణులైన వీరశిఖామణు లిరుగడలఁ బల్లకి ననుసరించి వచ్చుచుండఁగా కేశవభట్టు సుఖప్రయాణము చేయుచుండెను. ఆతని బంగరు పల్లకిపైఁబడు సరుణ

సూర్యకిరణములు చూపఱ కనులకు మిఱుమిట్లు గొలుపు చుండెను. అశ్వారూఢులును, గజారూఢులు నైనవారు ముందు వెనుకల ననుసరించుచు వచ్చుచుండిరి. దివిటీలు వెలుఁగుచుండెను. కేశవభట్టు పల్లకి ముసుఁగులో నుండి చూచుచు మహానందభరితుఁ డయ్యెను. ఎందుకన తా నింతటి మహాగౌరవ ప్రతిపత్తితో, విజయానందముతోఁ దన గ్రామమును బ్రవేశించ కలిగినందులకు.

గ్రామప్రజలు కొంతతడవునకు సన్వాడిఁబట్టి గ్రహించిరి. ఆబాలగోపాలము గ్రామముఖమునకు వచ్చి నిలిచిరి. ఆ సంరంభమును జూచి యేదియో దేవతఁ గాని వచ్చుచున్నారని సన్నాహములకుఁ బ్రారంభించిరి. గ్రామాధిపతి మనుష్యులఁ బంచెను. కొందఱు వీధులూడ్చుచు, మఱి కొందఱు నీళ్ళుఁజల్లుచు, గ్రామములో భగవంతుని కొందఱు ప్రవేశపెట్టుటకు పరిశుద్ధిఁ గావించిరి. స్త్రీలు గృహముల ముందు ముగ్గులు దీర్చి, పసుపుకుంకుమల ద్వారప్రాంగణముల నలంకరించుచుండిరి. అంతలో నాయుత్సవము సమీపించెను. దేవుని యుత్సవమేనని యందఱు భావించుచుండిరి.

వాద్యము లాపఁబడెను. భటులు ప్రక్కలకుఁ దొలఁగిరి. వీరులు వాహనములనుండిదిగి పల్లకిని సమీపించిరి. తనలోఁ గలిగిన మహానందమును హృదయములోనే యణఁచుకొనుచు కేశవబట్టు వేఱొక వ్యక్తికొఱకు నిరీక్షించు చుండెను. ఆ వ్యక్తి వినయవిధేయత లచ్చుపడఁ బల్లకి సమీపించి తన కరమును జాఁచి కేశవబట్టును పల్లకినుండి దింపెను. అతఁడు

ముసిముసి నగవులు నగుచు గ్రామప్రజలను సమీపించెను. వారెల్ల నాశ్చర్యచకితులైరి. కొందఱు కౌఁగిలించుకొనిరి. యొకవైపునఁ గల జన మసూయపడెను. అందఱుఁ గలిసి గ్రామమునఁగల శివాలయముఁ బ్రవేశించిరి.

సభ సమావేశ మయ్యెను. ప్రజలు నిశ్శబ్దముగఁ గూర్చుండిరి. ఒక రాజోద్యోగి సమావేశకుల నుద్దేశించి "సోదర సోదరీమణులారా! కర్ణాటాంధ్ర క్షమావల్లభుఁడైన శ్రీ కృష్ణదేవరాయలు కేశవభట్టు భరతనాట్యకౌశలమునకు నానందించి యీ విధమైన రాజమర్యాదలతో నాదరించుచు, నాయన వంశపారంపర్యముగ నీ గ్రామమును సర్వాధికారములతో ననుభవించుకొనుటకు దాన మొసఁగినాడు. నేఁటి నుండి యీ గ్రామమునకు సంబంధించిన రాజమర్యాద లితనికే చెందినవి. తాము చెల్లించుచుండిన రాజశుల్కము వీరికే ముట్టఁజెప్పవలెను. గ్రామ శాంతిభద్రతలకుఁ దప్ప మఱొక విషయములో చక్రవర్తికి ప్రవేశముండదు. గ్రామాంతరంగిక పరిపాలనలో నీయనయె సర్వాధికారి—నియంత. అధికారదత్తతకు సుముహూర్తము కొన్ని ఘడియలలో నాసన్నము కానున్నది. తా మెల్లరు నాయత్తపడుచుఁడు" అని చెప్పెను.

ప్రతి యింటివాకిట మంగళతోరణములు కట్టఁబడెను. వీథు లలంకరించిరి. గ్రామాశేషస్త్రీలు నూత్నాంబరాభరణాదులను దాల్చి పేరంటములకు పిల్చుకొనునట్లు నొకరి నొకరు పిలుచుకొని వచ్చుచుండిరి. బ్రాహ్మణు లాహ్నిక

క్రియలు ముగించుకొని సభాప్రదేశమును జేరుచుండిరి. సకల మతములవారు, నశేషకులములవారు, వివిధవృత్తులవారుఁ జేరవచ్చిరి. కేశవభట్టు తన యింటికిఁ బోయి స్నానసంధ్యా వందనాద్యనుష్ఠానముల ముగించి సపత్నీపుత్రసమేతముగా పల్లకిలో శివాలయమునకు మఱల విచ్చేసెను. ఆ కేశవభట్టు గృహిణి యానందము వర్ణనాతీతము.

గ్రామాశేషము సమావేశ మయ్యెను. పూర్వా చారము ప్రకారము కులక్రమమున వరుసలు దీరి కూర్చుం డిరి. ముత్తైదువ లెల్లఁ బసుపు కుంకుమలను బెట్టుకొని, గంధముల నలఁదుకొనుచు, సరసములాడుకొనుచుండిరి. బ్రాహ్మణులు మంత్రపారాయణము సేయుచు సుముహూర్త మున కెదురుచూచుచుండిరి. కేశవభట్టు పత్నీపుత్రసమేత ముగా నున్నతాసనమునఁ గూర్చుండఁ బెట్టఁబడెను. రాజ భటులు చుట్టును మూగియుండిరి. ప్రధాన రాజోద్యోగి నూత్నవస్త్రాభరణాదులను, రాజశాసనపత్రముఁ దీసికొని నిలు వఁబడియుండెను. మేళతాళము లున్నతస్థాయిలో వాయింపఁ బడుచుండ నా సంరంభము వివాహమంగళమువలె నుండె ననుటలో సందేహమేమి ?

సుముహూర్త మాసన్నమైనది. రాజోద్యోగి స్వర్ణ కలశోదకముతో కేశవభట్టు పాదములు గడిగి, యుత్తరీయ ముతో నదుఁగుతొత్తెను. నూత్న దుకూలాదు లీయఁగా నా దంపతులు వానిని ధరించిరి. చిత్రవిచిత్రాభరణముల నలంకరించుకొనిరి. విజయనాదములు మిన్నుముట్టుచుండఁగా

నా యుద్యోగి రాజశాసనపత్రము నిట్లు చదివెను. "మూరు రాయరగండాది బిరుదాంకితుఁడు, నాంధ్రకర్ణాటసామ్రాజ్య సార్వభౌముఁడు, కళాప్రియుఁడు నైన శ్రీ కృష్ణదేవరాయులుం గారు ముంగొండలోని సమస్త ప్రజానీకమునకుం జేయు విజ్ఞాపన మేమనఁగా, మీ గ్రామములో జన్మించి, భరత నాట్యమున నఖండ ప్రావీణ్యమును సంపాదించి, మా యాస్థానమున కేతెంచి, తమ కళాకౌశల్యముచే మమ్ముల నానందింపఁజేసి మా మెప్పును బొందిన కేశవభట్టునకు ముంగొండగ్రామమును సర్వాధికారముల ననుభవించుటకు నగ్రహారముగా నొసంగుచున్నాము. ప్రజ లీ శాసనము నతిక్రమింపఁ గూడదని రాయలుంగారి యభిప్రాయము" అని చెప్పి యధికారము నప్పగించెను. మంగళవాద్యము లొక్కుమ్మడి ఘోషిల్లెను. సువాసినులు హారతు లెత్తిరి. బ్రాహ్మణులు వేదాశీర్వచనములఁ గావించుచు సేసలఁ జల్లిరి. రాజభటులు సైనికవందన మాచరించిరి.

కేశవభట్టు ముకుళిత కరకమలుఁడై, లేచి నిలుచుకొని "సోదర సోదరీమణులారా! నే నింతటి మహాగౌరవము నకు నర్హుఁడను గాకున్నను మీ యందఱ యాశీర్వాదబలము చేత, నాంధ్రసార్వభౌములైన శ్రీ కృష్ణదేవరాయల కళాభిమానముచేతను నా కిట్టి గౌరవ మబ్బినది. ఇందులకు మీ కెల్లరకుఁ గృతజ్ఞతాబద్ధుఁడనై నమస్కరించుచున్నాఁడను. నా కళావిశిష్టతను గాంచి మెచ్చుకొని, యింతటి యుదార దానముచే నన్నుఁ బరితుష్టుఁ గావించిన రాయల నభినందించు

చున్నాను. సాంప్రదాయసిద్ధముగ నేను దేవబ్రాహ్మణులకు, నశేషవృత్తులకు, దానధర్మములకు, గ్రామకార్యములకు భూముల దాన మిచ్చుచున్నాను. శేషించిన భూమిని మాత్రమె నా స్వంతముగఁ జూచుకొందును. గ్రామమర్యాదలు తప్పకుండఁ బ్రవర్తింతును. మీరెల్లరు నాకు చేదోడు వాదోడుగా నుండి గ్రామపరిపాలనను విజయవంతము చేయవలసినదిగా ప్రార్థించుచున్నాను. ఇఁకమీఁద నెవరికి నెట్టి లోపములు జరుగవు. ఒకేకుటుంబములోనివారమువలె మనము మెలఁగుదము'' అని యుపన్యసించెను.

అసూయాపరులైన బ్రాహ్మణులలోఁ గొంత యలజడి బయలుదేఱినది. కాని, యా సభలోని యుత్సాహమును జూచి వారు పెదవిని గదలింపఁ జాలరైరి. అంతట సభ సమాప్తము కానుండెను. ప్రధానరాజోద్యోగి ''నేఁడు మహారాజులుంగారి యుభయముతో గ్రామాశేషప్రజలకు నిచ్చుట నన్నదానము జరుగును. ఎల్లరు విచ్చేయవలసినదని రాజపరముగ నేను ప్రార్థించుచున్నా'' ననియెను.

సూర్యాస్తమయమున కొక ఝాము కలదనఁగా భోజనములు ప్రారంభమయ్యెను. అర్ధరాత్రమువఱకు సాగినవి. కొన్ని వేలమంది భుజించిరి. పంచభక్ష్యములతో, నిష్టమృష్టాన్నములతో నెల్లరు సంతృప్తిఁ జెందిరి. భోజనసమయమున బ్రాహ్మణబృందములో ననేకవిధములైన యూహాపోహలు బయలుదేఱెను. కొందఱు కేశవభట్టు ప్రతిభను వేయినోళ్లఁ బొగడిరి. మఱికొంద ఱసూయతోఁ దెగడిరి.

పుర్రె కొక బుద్ధి, తల కొక నాలుక! అన్నట్లు లయ్యెను. బహుజనాభిప్రాయము మాత్రము కేశవభట్టు ముంగొండ గ్రామమునకుఁ దన నాట్యకళాతిశయముచే ప్రఖ్యాతిని సము పార్జించినాడనియె. అది కాదన్నవారుఁ గలరు. ఇట్టి విధానము ప్రపంచసహజము. ఏది యెట్లున్నను నేఁటినుండి కేశవభట్టు † ముంగొండాగ్రహారాధిపతి.

---

3

శ్రీలతో కేశవబట్టు తులతూఁగ సాఁగెను. గ్రామ ప్రజలందఱు నతని కనుసన్నలో మెలఁగుచుండిరి. పావన గోదావరీజలముల ముక్కారుఁ బండు కేదారంబులచే నచటి ప్రజలు దరిద్రమన నెట్టిదో యనుభవింపని వారలైరి. దాన ధర్మములు వర్ధిలుచుండెను. వివిధవృత్తులవారు, గ్రామపు చాకిళ్ళు, తమకుఁ బెట్టఁ బడిన యినాముల ననుభవించుచు స్వామిభక్తిపరాయణులై ప్రవర్తిలుచుండిరి. దేవతాపూజలు క్రమముగ నిర్వహింపఁబడుచుండెను. మోతుబరి రైతులు శ్రద్ధాళువులై కృషినొనర్చుచు సకాలములో కేశవబట్టునకుఁ బన్నులు చెల్లించుచుండిరి. బ్రాహ్మణులు నిరతవిద్యావ్యా సంగముల హాయిగఁ గాలముఁ బుచ్చుచుండిరి. వర్తకులు క్రమ విరుద్ధలాభము లపేక్షింపక వ్యాపారముఁ గొనసాఁ గించుచుండుట విశేషము. ప్రజలలో నెవరియందు నెట్టి యసంతృప్తియు లేకుండెను.

---

† గోదావరీ మండలములో అమలాపురం తాలూకాయందు కలదు.

కేశవబట్టు సిరిసంపదలకుఁ గొందఱు కన్నుగుట్టెను. ఐశ్వర్యము మాత్సర్యమునకుఁ గారణమగుట సహజమేకదా? ఆ యసూయావంతులు బ్రాహ్మణులే యగుట మఱియు విచిత్రము. కేశవబట్టున కీ మహాగౌరవ సంపదలబ్బు నని కలలోనైన నెవరుఁ దలఁపలేదు. అతఁడు చెప్పఁగోతగ్గ పాండిత్యము గలవాఁడని యింతకుముం దెవ్వరు గుఱుతింప లేదు. నివురుగప్పిన నిప్పువలెనుండి కాలముగడుపుచుండెను. సంచారార్థము దేశములోఁ దిరిగి యుదర పోషణమునకై యవస్థలు పడుచుండుట పరిపాటి. ఏ మహాగురు ప్రసాదము చేతనో నాట్యకళయం దాఱితేఱినవాఁడై మహారాజ సందర్శనమునకు మొదలిడెను. కళ నర్థము చేసికొనఁగల రాజుల కాంధ్రదేశములో కఱవు. ఆతని కళాసంపదను గుర్తిం చిన ప్రప్రథముఁడు శ్రీకృష్ణదేవరాయలు.

కేశవబట్టు కష్టములు గడతేఱెనని భావించెను. ఆతని భార్య మహాలక్ష్మి. అన్నాహారములకై పరితపింపవలసి వచ్చిననాఁడు, నితరుల సహాయ మభ్యర్థింపని మానవతి. కలిగినదానితోఁ దృప్తిపడి, భర్తసంచారార్థము వెళ్ళినపు డనేక కఠోరోపవాస దీక్షల కాకతేఱినది. ఒకరి యైశ్వర్య మునుగాంచి క్రుంగలేదు. తన లేమిని గుఱించి వగవలేదు. కష్టసుఖములు కావడికుండలను సత్యము నేనాఁడో తెలిసి కొన్నదాసాధ్వీమణి. లేక లేక నొకకుమారుఁ డా దంపతుల పూర్వపుణ్యమున జన్మించెను. వాని నామధేయము పేరు భట్టు. ఇపుడు సమకూరిన సంపత్తు కుమారుని యదృష్టముననే

యని యా దంపతులు భావించి, వానిఁ బూలలోఁ బెట్టి పెంచుచుండిరి. బాలుఁడు దినదినాభివృద్ధిని బొందుచు తల్లిదండ్రుల నానందపెట్టుచుండెను.

ఆ గ్రామములో నొక యంతర్విప్లవము లేవనెత్తవలె నని యసూయాపరులు పన్నగములఁ బన్నుచుండిరి. వారలకొక చక్కని యూహా పొడమినది. నాఁటి ప్రజలకు మత, కులాచారములపై మూఢవిశ్వాసము గలదు. దాని నాధారముగఁ గొని కేశవభట్టుసంసారమును రట్టుచేయవలె నని యొక ముఠా బయలుదేఱెను. ప్రాఁత శాస్త్రములఁ దీసి వెదకిరి. వేదముల గాలించిరి. ఒకశాస్త్రములో నొకవైపు వారికిఁ గావలసిన యొక యంశము లభించెను. నటకులు పఙ్క్తి బాహ్యులు, సదాచారపరాయణులు వారితోఁ గలిసి భుజించుట ధర్మశాస్త్ర విరుద్ధముగ నిర్ణయించిరి. కేశవభట్టు గృహమునకు సద్బ్రాహ్మణు లెవ్వరుఁ బోఁ గూడదని యాంక్ష పెట్టిరి. ఈ విధముగఁ జేసి తమప్రయత్నమును నెరవేర్చుకోఁ గలిగినారా యసూయాపరులు.

విప్లవబీజములు నాటఁ బడినవి. అసూయాపరులు ప్రజలను గేశవభట్టుపై తిరుగుబాటునకుఁ బ్రయత్నింపసాగిరి. పన్నులీయ నవసరము లే దనియు, కులమర్యాదకు వ్యతిరేకముగ నడచిన కేశవభట్టున కన్ని విషయములలోను మర్యాదలు గావింపఁగూడదనియు ప్రచారము చేయఁబడెను. ఏ యొకటి రెండు కుటుంబములవారో తప్ప నితర బ్రాహ్మణ కుటుంబము లన్నియుఁ గలిసి కట్టుగ నీ వ్యవహారములో

దిగిరి. గ్రామములోని నియోగులును వారితోఁ జేయిఁ గలిపిరి. దినదినమునకును వారి బలమభివృద్ధియగుచుండెను. కేశవభట్టుమాట వినువారే కనిపించుట లేదు. ఇంటి పై పనులు చేయించుకొనుటకైనను మనుష్యులు దొరకకుండి రన్న యాకుటుంబస్థితి నూహించుకొనవచ్చును. జీవితము నరకకూపమువలె నైనది. మహాలక్ష్మి యొకనాఁడు భర్తతో గ్రామవిషయమును గుఱించి ముచ్చటించుచు కంటఁ దడిఁ బెట్టినది.

ఫలసాయపుదినములు వచ్చినవి. గ్రామములోని పిన్న పెద్దలందఱు సమావేశమై కేశవభట్టునకు పన్ను లీయ నిరాకరించుచు నొక తీర్మానము గావించిరి. ఈ విషయముఁ దెలిసుకొన్న కేశవభట్టు మిగులఁ జింతించెను. ఏమి యుపా యమును దోఁచలేదు. రాజమహేంద్రవరమునఁ గల రాజప్రతినిధిని సందర్శించి తనకు జరిగిన విద్రోహచర్యల నెఱింగింపఁ గృతనిశ్చయుఁడై యొకనాటి వఱువాతఁ బ్రయా ణమై వెళ్ళెను.

రాజప్రతినిధి కేశవభట్టును సగౌరవ పురస్సరముగ నాహ్వానించి, యాయన కష్టసుఖములను విని యభయము నొసఁగెను. వెంటనే కొందఱ నుద్యోగులను కేశవభట్టు వెంటఁ బంపుచు "పన్నులు పూర్తిగా వసూలుచేసి యగ్ర హారకున కప్పగింపుఁడు. విప్లవకారులను మందలింపుఁడు. ఎదురు తిరిగినవారిఁ గొని రావలెను. కేశవభట్టునకు నెట్టి యపచారము జరిగినను రాజాగ్రహపాత్రులు గావలసి వచ్చు

నని గ్రామములో చాటిరం”డని చెప్పి పుత్తెంచెను. కేశవ భట్టు 'మహాప్రసాద' మని యనుజ్ఞాతుడై సాశ్వికభటులతో గ్రామమునకుఁ బయనించెను.

గ్రామీణులు రాజభటులఁ గాంచి భయభ్రాంతులైరి. ప్రాణములన్న నెవరికైనఁ దీపియే కదా? రాజభటులు ప్రతి యింటికి వెళ్ళి 'పన్నులు నేఁటి సాయంకాలములోపలఁ జెల్లించిన సరి. లేకున్న కొరడాలఁ గొట్టుదుము. గుఱ్ఱములకుఁ గట్టి యీడ్పింతుము. హస్తములపై శిలలఁ బెట్టింతుము,' అని బెదరించిరి. ఆరోజు సాయంకాలమే రావలసిన మొత్తమంతయు వసూలయ్యెను. ప్రతివారును కేశవభట్టు నింటి కేతెంచి పన్నులు గట్టి పోయిరి. వచ్చినవారికెల్ల “గ్రామములో నెట్టియశాంతి ప్రజ్వరిల్లినను మేమువచ్చి యడంతుము. విచక్షణ లేకుండ నందఱ దండింతుము. కాఁబట్టి ప్రజలెల్లరు నడఁకువతో మెలఁగుచు కేశవభట్టునకు వ్యతిరేకముగఁ బ్రవర్తింపకుండ నుండవలె”నని తెలియఁ జెప్పి వెళ్ళిపోయిరి.

నాఁటి నుండి ప్రజలలో ధైర్యము సన్నగిల్లెను. విప్లవబీజములు పాదులోనే చెల్లాచెదరుఁ గావింపఁ బడినవి. లో లోపలఁ బ్రతివారు కుములుచుండిరి. బయటికి మాట్లాడ సాహసము లేకుండెను. బ్రాహ్మణులు తమ పథకము తల్ల క్రిందులై నందులకు విచారపడుచు సమయమునకుఁ గాచుకొని యుండిరి. కేశవభట్టు సుఖముగఁ గాలము పుచ్చుచుండెను.

---

౪

పేరు భట్టున కుపనయన మయ్యెను. కుమారునకు విద్యాభ్యాసము చేయించుటయే కేశవభట్టు ప్రధాన లక్ష్యము. పేరు భట్టుకూడఁ దండ్రికిఁ దగిన కొడుకె. కుశాగ్ర బుద్ధి. విద్యయం దభిరుచి గలవాఁడు. వినయ విధేయతల కతని కతఁడె సాటి. స్ఫురద్రూపి. మాతా పితృ శుశ్రూష చేయువాఁడు. గృహకార్యములం దమిత శ్రద్ధాళువై యుండెను. కేశవభట్టునకుఁ గుమారుని మహాపండితుని గావించవలయు నని యూహ. అందుచేఁ దనకు వచ్చిన విద్య నంతయు నూఱిపోసెను. బాలకునిలో నభ్యుదయ రేఖలు విలసిల్లినవి. 'పూవు మొగ్గతోడుఁగఁగనే వాసన విరజిమ్ము' నన్నట్లు విద్యాప్రారంభ దశయందె యతని యూహాపోహ లతిమాత్రముగ గుఱుతింపఁబడెను. ఆ బుద్ధి వికాసమునకు మహాప్రతిభా ప్రభావ సంపన్ను లగు దేశికుల సాన్నిధ్యము స్వర్ణమునకు సువాసన యబ్బినట్లుండు నని కేశవభట్టు భావించెను.

పూలలోఁ బెట్టి పెంచిన కుమారుని విద్యాభ్యసన మునకై దేశాంతరగతుఁగావింప నా తల్లిదండ్రుల మన స్సొప్పలేదు. మమకారము పురోభివృద్ధి నాటంక పఱుపఁ గలదా? ఇదియె వారికి తీఱని సమస్య. తుదకు నిర్ణయించు కొనిరి. సాంప్రదాయ సిద్ధముగ నావంశము విద్యలో నాఱి తేఱిన సంతాన పరంపరతో వచ్చుచుండెను. అట్టి సాంప్ర దాయమును నేఁ డెట్లు త్రోసిరా జనఁగలరు? ప్రతి మాన

వునియందు గ్రహణశక్తి యొకే విధముగ నుండును. అయినను వానివాని సాధనను బట్టి, యవధానమును బట్టి వికాసము నందుచుండును. ఈ వికాసమునకు బోధకుఁడె దోహదమిూయఁ గలవాఁడు. అట్టి యవకాశముఁ గలిగించుట పోషకుల విధి. ఆ విధ్యుక్తధర్మము నెఱింగి ప్రవర్తించుట ముఖ్యము. ధనధాన్యాది సంపత్తు లెన్నియున్నను విద్య లేకున్న మానవుఁడు రాణింపఁడను లౌకిక సత్యము నా దంపతు లెఱింగినవారై తుదకొక నిర్ణయమునకు వచ్చిరి. తమ గ్రామములో జరిగిన తిరుగుబాటు ఫలితముగా పేరు భట్టునకు భరతశాస్త్రము నేర్పఁ దలఁచుకొన లేదు. శాస్త్రపండితునిఁ జేయుటయే శ్రేయోదాయక మనుకొనిరి.

అనవాప్త యౌవనుఁడు. అననుభూత దేశ సంచారి. సదసద్వివేకము లేనివాఁడు. విద్యాభ్యాసమున కెట్లు దేశ దేశములఁదిరుగఁ గలఁడని తల్లిదండ్రులు లోలోనఁ గుములు చుండఁగా ననుజ్ఞాతుఁడై ప్రయాణమయ్యెను. గ్రామప్రజ లతని సాహసమున కచ్చెరు వొందిరి.

పురావిద్వ త్సంప్రదాయములు నిల్పుకొని, భారత దేశమునకు విజ్ఞానభిక్ష పెట్టుచుండిన విద్యాకేంద్రము వారణాశి. వ్యాసునితోఁ బ్రారంభమై, బౌద్ధ విద్యాలయ ములతోఁ బ్రవర్థిలి భారత ప్రాచీన విజ్ఞానమునకు కాణాచిగ నున్నది. పవిత్ర గంగాస్నానపానములచే తను, సమస్త దురిత హరుఁడైన విశ్వేశ్వర దర్శనముచేతను, సకల మానవులఁ బరితృప్తులఁగావించు నన్నపూర్ణాదేవి పూజనము

చేతను, భారత ఖండాఖిల ప్రాంతములనుండి తీర్థ యాత్రార్థ మేతెంచు పండిత ప్రకాండుల సంతతి సహవాసము చేతను కాశీవిద్యా పీఠములోఁ జదివిన వారలకు శీఘ్రముగ విద్య సంప్రాప్తించు నని ప్రవాదము. శతయోజనదూర మున్నను విద్యానిష్ణాతృత్వమునకుఁ బ్రతి యొకరు కాశీవిద్యాపీఠమునకె పోవుచుండిరి. ఆ నాఁటి కాంధ్రక్షేత్రములో చతుర్వేదములు, షట్శాస్త్రములు, లలితకళలు నభ్యసింపఁ జేయు నొక్క కేంద్రము లేకుండెను. అందుచే నాంధ్రులెల్లరు కాశికిఁ బోవుచుండిరి. పేరుభట్టు గూడ నా సంస్కృతీ కేంద్రమునే చేర నభిలషించెను.

కాశీమహాపట్టణమును జూచి పేరుభట్టు దిగ్భ్రాంతుఁ డయ్యెను. ఋతుద్వయము నొక్క ప్రయాణ కష్టము ననుభ వించుటచే నతని శరీరము నిస్త్రాణమయ్యెను. గంగానదిలో స్నాన మాచరించి, విశ్వేశ్వరుని సందర్శించి, యన్నపూర్ణా భోజన సత్రమున భుజించు విశ్రాంతి గైకొనెను. ఆ పిమ్మట విద్యాలయమునకుఁ బోయి యాంధ్రుఁడననియు, గోదావరీ ప్రాంత నివాసి ననియుఁ జెప్పుకొనెను. కాశీ విద్యాపీఠములో విద్యార్థులుగఁ జేరి, తమ కష్టసాధిత పాండిత్య ప్రకర్షచేత స్థానిక మహాపండితుల మన్ననలంది యా విద్యాపీఠము ననె యాచార్యపదవి నధిష్ఠించిన వార లాంధ్రులెందఱో గలరు. వారు పేరుభట్టు రాకకు సంతోషించి, యతనికిఁ గ్రొత్తఁ దనపు బాధ కలుగకుండ నన్నివిధముల తోడ్పడి విద్యా పీఠములోఁ జేర్పించిరి.

కాశీ విద్యాపీఠము సమస్తవిద్యలకుఁ గేంద్రము. వేదములు, వేదాంగములు, శాస్త్రములు, సాహిత్యము, నిది యది యననేల నన్నియును బోధింపఁ బడుచుండెను. ఒక్కొక్క దాని కొక్కొక్క యాఁతితేఱిన దేశికుఁడు గలఁడు. ఎవరికి దేనియం దభిమానము గలదో వారికి దానిని నేర్పు చుండిరి. వేద, వ్యాకరణ, సాహిత్య శాఖలయం దాంధ్రులా చార్య పదవుల నధిష్ఠించి యుండిరి. విద్యార్థులకు భోజన, వసతి సౌకర్యము లందె గలవు. ఆంధ్రులన్న నా విద్యాలయ ములో మహాగౌరవము. ఎందులకన వేదములకు స్పష్టోచ్చార ణములో నాంధ్రుల కితరులు సాటిరారు. సంస్కృత మాం ధ్రులకు నచ్చి వచ్చిన భాష. ఇతర ప్రాంతములవా రెంతగ ప్రయత్నించినప్పటికి నాంధ్రుల ప్రత్యేకతను మాత్రము జయింపఁ జాలరైరి. పేరుభట్టు సాంప్రదాయానుసారము వేదములను సమగ్రముగ నధ్యయనముఁ జేయుటకుఁ బ్రారం భించెను.

నాలుగు వత్సరములలో వేదపాఠమును బూర్తిఁ జేసెను. తర్వాత జ్ఞానేంద్రభిక్షువుచెంత నద్వైతమును జదివెను. అపరపాణినాఁ బ్రఖ్యాతుఁడై, కాశీ విద్యాపీఠ మున కలంకారప్రాయుఁడుగ నుండిన శేష వీరేశ్వరుని సాన్నిధ్యమున వ్యాకరణము నేర్చెను. వేదశాస్త్రములకు నికషమువంటిదైన తర్కశాస్త్రమును మహేంద్రునియొద్ద నభ్యసించెను. ఖండదేవుని దగ్గఱ మీమాంసను జదివి, యభ్యస్త సర్వశాస్త్రుఁ డయ్యెను. విద్యాపీఠపు విద్వ

త్పరీక్షలో ప్రథమ కక్ష్యయం దుత్తీర్ణుఁడై యాంధ్ర ప్రత్యే కతను మఱల దేశమున కొకమాఱు చాటెను. ద్వాదశ వర్షములు విద్యాశిక్షతోఁ గాలముగడపి, గురువులందఱ చేత నాశీస్సులఁబడసి, సహపాఠకులచే సాగనంపఁబడినవాఁడై స్వదేశమునకుఁ బయనమయ్యెను.

భారతదేశ ప్రధాననగరములఁ గాంచుచు నాంధ్ర దేశముఁ జేరవలయునను తలంపు పేరు భట్టునకుఁ గలిగినది. విద్య విదేశగమనమునందు బంధుజనములతో సమానమని పెద్దలు చెప్పియున్నారు కదా ? అది యితని విషయమునఁ బ్రత్యక్షం సత్యము. ఎచటి కేగిన నన్నవస్త్రముల కతఁడు బాధపడలేదు. కాశినుండి ప్రయాగమీఁదుగఁ బయనమై, సౌరాష్ట్రముఁ జూచుకొని, కాళిదాసుపైనుండు గౌరవముచే నుజ్జయినిఁ దిలకించి, నాఁడు హిందూదేశపు చక్రవర్తిగఁ బిలిపించుకొనుచుండిన అక్బరు చెంత బహుమానములంది ఢిల్లీ పట్టణమును సందర్శించెను. మహావిదర్భ, కోసల దేశములఁ గ్రుమ్మరెను. వంగదేశముగుండ బయలుదేఱి యటనట తీర్థయాత్రలు సలుపుచు పూరి క్షేత్రమును చేరు కొనెను.

జగన్నాథుని సందర్శించి తన్మయుఁడై యాంధ్రదేశ మును సమీపించుచున్నాను గదాయని కొంత ధైర్యమూని, తన కాశీప్రయాణము మొదలు నాఁటివఱకు జీవితములోఁ గలిగిన యనుభవములను గుఱించి యాలోచించుకొనుచు దేవాలయద్వారమందలి నొక వితర్దికపై శయనించెను.

వివాహమైనట్లు, కొంతకాలమునకె యొక పుత్రుఁడు కలిగినట్లు, వాఁడు భారత సారస్వతాకాశములో ధ్రువతారగా నిలుచునట్లు స్వప్నముఁ గాంచెను. తక్షణమె యుత్థితుఁడై జగన్నాథస్వామిని సమీపించి దర్శనముచేసికొని మఱల మఱల నమస్కరించుచు మార్గముఁ బట్టెను.

పండ్రెండు సంవత్సరముల యనంతరము మహావిద్వాంసుఁడై కుమారుఁ డింటికిఁ దిరిగివచ్చుట యాతల్లిదండ్రుల కెనలేని యానందము చేకూర్చెను. తనయుని సాహసమును, విద్యాసాధనమును మిక్కిలి కొనియాడిరి. మహాలక్ష్మి కోడలి కొఱకు కొన్నిదినములనుండియె యువ్విళ్ళూరుచుండెను. తన యుఁడు విద్యాసంపన్నుఁడై యున్నందున యుత్తమకుటుంబమువారె బంధుత్వమునకు వచ్చెదరని యామె తలంపు. ఆతలంపు ఫలించినది. సమానమైన వియ్యము. కన్యకను చూచివచ్చిరి. పార్వతీదేవివలె నున్నదని యడిగినవారిని తనకుఁ గాబోవు కోడలిని గుఱించి మహాలక్ష్మి చెప్పుచుండెను. వధువుపేరు శ్రీలక్ష్మి. వివాహమంగళము వైభవముగ జరిగినది. పేరుభట్టు మహా విద్వాంసుఁడని యాంధ్రదేశమం దంతటను దెలిసిపోయెను.

---

౨

పేరుభట్టు స్వప్నము ఫలించినది. శ్రీలక్ష్మి గర్భమున మగశిశువు జనించెను. జగన్నాథస్వామి వరప్రసాదలబ్ధమైన యాశిశువునకు జగన్నాథుఁడని నామకరణ మొన

ర్చిరి. బంధువులెల్లరు నామమహోత్సవమున కేతెంచి వైభవముగ జరిపించిరి. గ్రామములోని బ్రాహ్మణులందుఁ బాల్గొనలేదు. వారు లోలోపల కక్ష సాధించుచుండిరి. వారిలోఁ గొంత చీలిక బయలుదేఱెను. కేశవభట్టు మాత్రమెనటుఁడు. అతఁడొకఁడె పంక్తిబాహ్యుఁడు గదా ? విద్యాసాగరుఁడు, సత్ప్రవర్తనుఁడైన పేరు భట్టున కేమి కళంకము గలదు ? అతని నెట్లు దూరము చేయవచ్చునని కొందఱు వాదించుచుండిరి. వారిలో వారికె యీవిధముగఁ గలఁతలు ప్రారంభమయ్యెను.

జగన్నాధుఁడు తల్లిదండ్రులచే నల్లారుముద్దుగఁ బెంచఁబడుచుండెను. పురాణదంపతులగు కేశవభట్టు దంపతులామనుమని నత్యంత ప్రేమతో లాలించుచుండిరి. పేరుభట్టు తన తల్లిదండ్రులకు స్వప్నవృత్తాంతమును వినిపించి, జగన్నాధుఁడు ప్రపంచవిఖ్యాతుఁడు కాఁగలఁడనియు, వంశము నుద్ధరింపఁగల సమర్థుఁడనియు నొక్కి వక్కాణించుచుండెను. అందఱ యాశలు నాముక్కుపచ్చలారని బాలునిపైఁ గలవు. బాలునిలో నున్నతపురుష లక్షణములు ప్రతిబింబించుచుండెను.

మృత్యువు సకల ప్రాణులకుఁ బ్రతిఘటింపరానిది. ఈ మృత్యువును బట్టియే విశ్వలీలారహస్యముల నెఱుంగఁ జాలుదుము. కాలవ్యాఘ్రము కడుపులో దివారాత్రము లెందఱో మాటు మణఁగుచుందురు. అష్టైశ్వర్యములతో, చతురంబోధి పరీత భూఖండ మప్రతిహతముగ నేలు సార్వభౌము

నైనను మృత్యువు గబళింపఁగలదు. ఉపనిషన్మీమాంసలఁ బ్రౌఢుబుచ్చు ఋషిపుంగవునైన మృత్యువు మ్రింగును. ఈ భూతమునకు విచక్షణ లేదు. కరుణ, దయ, యభిమానము నను చేరరావు. మానవచరిత్రలో మృత్యువును జయించినవారు మాత్రము లేరు. కేశవభట్టు దంపతులు మృత్యువు వాతఁబడిరి. సంసారభారమంతయు పేరుభట్టుపైననె నిలిచెను. సముద్రము నీఁదినట్లు సంసారము నీఁదుచున్నాఁడు.

జగన్నాథుఁడు పంచవర్షములు పూర్తిచేసికొనెను. అక్షరాభ్యాసముఁ జేసిరి. అతని కనులలో దివ్యజ్యోతులు వెలిఁగినట్లుండెను. శరీర మపరంజివలె నిగనిగలాడుచుండెను. మధురముగ్ధమైన శరీరలావణ్యము, కమ్మని పలుకులు చూచువారి మనస్సుల నాకర్షింపసాగెను. గ్రామములోని ప్రజలతనిపై వాత్సల్యరసమును గురిపించుచుండిరి. అచటి బాలుర కతనితో యాటలాడుకొనుట యన పండుగు. కొన్ని సంవత్సరములు గడువఁగనే యుపనయన మొనర్చి బ్రహ్మోపదేశముఁ గావించిరి.

జగన్నాథునిలో సూక్ష్మగ్రహణశక్తి కలదని పేరుభట్టు గమనించెను. మేధాశక్తి యపారము. విద్యాబోధనకుఁ దానె పూనుకొనెను. వేదములు సాంగముగఁ జెప్పెను. సాహిత్యపాఠ మగుటతోడనె, వ్యాకరణశాస్త్రము సక్రమముగ బోధించెను. జగన్నాథున కంతటితో శాస్త్రమర్యాదలు తెలిసివచ్చినవి. స్వయంకృషి చేతనె విద్యావ్యాసంగము చేయవచ్చునని తలంచెను. తండ్రిమాత్రి మందుల కిష్టపడ

లేదు. గురువిహీనమైన విద్య చంద్రుఁడు లేని రాత్రివలె సుశోభాయమానము గాదని చెప్పి తర్కశాస్త్రాధ్యాపనమున కుపక్రమించెను. జగన్నాథున కీ తర్కశాస్త్రము మిక్కిలి యభిమానపాత్రమైనది. అందలి వాదోపవాద విధానము, కారణవాదము సయుక్తికముగఁ దోఁచెను. సకలశాస్త్రములను సమ్మేళించు శక్తి యొక తర్కశాస్త్రమునకే కలదని సమర్థించెను. పిమ్మట పూర్వమీమాంసను జదివి సకల శాస్త్ర నిష్ణాతుఁ డయ్యెను. తాను ద్వాదశవర్షములలో సాధించిన విద్యను జగన్నాథుఁ డాఱువత్సరములలో సాధించుటఁ జూచి పేరుభట్టు తనకుమారుని ప్రతిభాసంపద కువ్విళ్ళూరెను. తనతో సమానమైనట్టి పాండితీప్రకర్ష గల కుమారునితోఁ గొన్నిసమయములందు శాస్త్రచర్చ చేయుచు, వాద వివాదములకుఁ బూనుకొనుచు జగన్నాథుని విద్యావ్యాసంగమునకు మెఱుఁగు పెట్టుచుండెను.

జగన్నాథునిలో నూత్నయౌవనాంకురములు పొడసూపినవి. శరీరము నవయౌవన స్నిగ్ధ మయ్యెను. అజానుబాహువు. ఆ విశాల నేత్రాంచలములలో శృంగారరసము నివాస మేర్పఱచుకొన్నది. ఆ సమదీర్ఘఫాలతలములో, వర్తుల ముఖకమలములో కళాసంపద తొణికిసలాడుచుండెను. ఎఱ్ఱని పెదవులు, దాడిమీబీజములఁ బోలురదనచ్ఛాయలు పలుకున కొక సొంపును నింపుచుండెననుటలో నతిశయోక్తి లేదు. భ్రమరనీలాలక లతని సౌందర్యమూర్తి కాతపత్ర మనవచ్చును. ఆతని వక్షస్థలము వీరకులాలంకారము.

పలుకులు తేనెసోనలతో నుపమింపఁ దగి యెదుటివాని మనస్సు నాకర్షింపఁ గలిగి యున్నవి. అతని రూపసంపద కాశ్చర్యపడనివారు లేరు—మహారాజలక్షణము లున్నవని విమర్శింపనివారును లేరు. రూపసంపదకు గుణసంపదయుఁ దోడైనది. విద్యాతిశయము వీనికన్నింటికి గీటుఱాయి.

వేదశాస్త్రములు, సాహిత్యము జగన్నాథునికి కరతలామలకము, ఇప్పుడతనిదృష్టి కళలపైఁ బ్రసరించినది. గ్రంథసహాయమున కవితాకళ నెఱింగెను. తాతగారు సంపాదించి భద్రముగ దాఁచియుంచిన భరతుని నాట్యశాస్త్రమును సమగ్రముగఁ జదివెను. అందలి నాట్యకళారీతు లతని మనస్సును చూఱఁగొన్నవి. చదివినంత మాత్రమునఁ దృప్తి కలుగలేదు. నాట్యకళ దృశ్యానుభూతము గదా? అది యొక పెద్దసమస్య. తండ్రినివిచారింపగాఁ భరతనాట్య ప్రదర్శనముఁ జూడవలె నన్న కూచిపూడి కేఁగవలె ననియుఁ దనతండ్రి యచటనే భరతనాట్య మభ్యసించి, కళాప్రవీణుడై శ్రీకృష్ణదేవరాయల మెప్పునంది యీయగ్రహారమును సంపాదించె ననియు వివరించెను. జగన్నాథునకుఁ గూచిపూడిని దర్శింపవలయు నను కుతూహలము జనించెను.

తల్లిదండ్రుల కావిషయ మెఱిఁగించినాడు. తండ్రి యందులకు సమ్మతించి "జాతిరత్నమైనను సానఁ బెట్టినఁ గాని తేజోవంతమైనగాదో, యటులనే విద్యావంతుఁడు విద్వత్పరిషత్తులకు వెళ్ళి, పాండిత్యమును బ్రదర్శించినఁ గాని పేరుప్రతిష్ఠ లందఁడు. దేశసంచారము పండితులకు ముఖ్య

కర్తవ్యము.'' అని చెప్పెను. శ్రీలక్ష్మియు నేమనజాలక పుత్రుని కౌఁగిలించుకొని త్వరలోఁ దిరిగిరమ్మని చెప్పి యాశీర్వదించెను.

జగన్నాథుఁడు ప్రయాణమై, యాంధ్ర దేశములో నచ్చటచ్చటఁ గల పండితుల దర్శించుచు, వారలతో వాగ్వాదములఁజేయుచు కృష్ణాతీరముఁ జేరెను. విజయవాడ లోఁగల విద్వత్పరిషత్తునకు వెళ్ళి సన్మానమునందెను. మార్గా యాసముతోఁ గ్లాంతశరీరుఁడై నప్పటికిని, తనకుగల కళాభి మానము చొప్పున కష్టములను లెక్కింపక నడచినడచి చివఱకు కూచిపూడి చేరుకొనెను.

కూచిపూడి యగ్రహారము వేదాంతము వారిది. వేదాంతమువారు పాండిత్యమునకును, భరతనాట్యమున కును, నిరతాన్నదానమునకును మహాప్రసిద్ధి. వారింట బస చేసెను. వారీ యువకపండితునిఁజూచి, సాక్షాత్సరస్వతీ స్వరూపముగ భావించి గౌరవించిరి. అగ్రహారములోని బ్రాహ్మణులతోనెల్ల బరిచయము గావించుకొనెను. నాట్య పాఠశాలకు వెళ్ళి తన యుద్దేశ్య మచటి యాచార్యులతో నావిష్కరించెను. వార లందులకు సమ్మతించి, పాఠశాల లోని విద్యార్థిబృందముచే నొక నాట్యప్రదర్శనము నేర్పాటు చేసిరి. జగన్నాథుఁడా నాట్యభంగిమములను జూచి యాశ్చర్య చకితుఁడయ్యెను. శాస్త్రమర్యాద చక్కఁగ పోషింపఁబడు చుండుట ప్రశంసాపాత్రము. నాట్యము చేసినది స్త్రీలా, లేక పురుషులా యను సందేహము నాచార్యునితో నెల్ల

డించెను. అతఁడు పురుషులు, స్త్రీలు కలరనియెను. జన్మ ధన్యమయ్యెనని సంతోషించి నాట్యభంగిమములను శాస్త్రానుగుణముగఁ దనలో వ్యాఖ్యానించుకొనుచు విడిదికి వచ్చి చేరెను. నాట్యకళ జగన్నాథుని హృదయములో నుత్తమస్థాన మాక్రమించుకొన్నది. నాఁటిరాత్రి భోజనము చేసి, గ్రీష్మర్తు వగుటఁజేసి గృహోపరిభాగమునకు వెళ్ళి శయనించెను.

రాత్రి నాలుగవ ఝామున తాళముల శబ్దము వినిపించెను. గవాక్షముగుండ నింటిలోనికిఁ దొంగిచూచెను. ఆగృహస్థు కుమారిక రాధికా నృత్యమును జేయుచున్నది. ఆ కన్యక కళానైదగ్ధ్యమునకు జగన్నాథుని శరీరము పులకరించెను. వెఱ్ఱెత్తినవానివలె నామె నాట్యము నేకాగ్రతతో వీక్షింపసాగెను. కన్యకలు తమ వంశపారంపర్యముగా వచ్చుచున్న యభిమానవిద్యను వివాహిత లగునంతవఱకు నేర్చుకొందురు. పాఠశాలలో నేర్చుకొని, గృహములలో వేకువజామున నభ్యాసము చేయుదురు. ఆనాట్యము జగన్నాథునిలో చిత్రవిచిత్రభావములను రేకెత్తించెను.

---

౬

జగన్నాథుని మనస్సులో నాందోళనము గలిగెను. ఒకవైపు శరీరకంపము. మఱియొకవైపు నానందచ్ఛాయలు. అతని కా నాట్యదృశ్యము కన్నులకుఁ గట్టిన ట్లయ్యెను. తన రసికత్వమున కది పరమావధి. క్రొంగ్రొత్త యూహాపోహ

లతని నలముకొన్నవి. ఆ యనుభూతి యపరిచితపూర్వము. నాట్యశాలలోఁ బ్రదర్శితమైన వివిధనాట్యభంగిమను లతని మనస్సుఁ జూరఁగొనలేదు. ఈనాట్య మంతగ నాకర్షించుటకుఁగల కారణమేమి? అదియె విచిత్ర సమస్య. కనులు మూసికొన్నను నిద్రపట్టుట లేదు. నూతన భావాంకురము లా యువక హృదయక్షేత్రములో మొలకెత్తుచున్నవి. ఆతని రసికతా పరివ్యాప్తి పరిశిష్టమగుచుండెను. వాంఛావికారములు స్థైర్యము నడఁచుచున్నవి. హృదయ ముద్వేగ పరిపూర్ణము.

నవోదయ రేఖలు ప్రాగ్దిశాంగనామణి పాదయుగ్మమునకు పారాణి లిడినవి. ప్రకృతి ప్రభాత సౌందర్యముతో విలసిల్లెను. జగన్నాథుఁడు స్నాతుఁడై నివేశమునఁ గల దేవతాగృహము ననుష్ఠానమునకై ప్రవేశించెను. గోమయముచే నలుకఁబడి, వివిధవర్ణములచేఁ దీర్చబడిన రంగవల్లికలు గలిగి, సకల దేవతాప్రతిమా సంపన్నమై, పూజాద్రవ్యాదికములు గలిగి యుండెను. జగన్నాథుఁ డేకాగ్ర చిత్తుఁడై భగవద్ధ్యాన మొనర్చుచుండెను. నూపుర కంకణధ్వనులు ఘల్లుమన్నవి. కనులు విప్పినాడు. ఒక మనోహరమూర్తి ప్రత్యక్షము. విభ్రమితుఁడైనాడు. ఆ కన్యకామణి మధుర మోహన ముగ్ధరూపరేఖ లతని చకితునిఁ గావించెను. ఆ బింబాధరోష్ఠ, మాయలి నీలాలకలసొంపు, నా నవయౌవనోదయ శృంగారరసావిర్భావ చాంచల్యమును నోఁచుకొన్న కన్నుగవయు, నాలవలీకపోల సౌందర్యము జగన్నాథుని

మంత్రరుద్ధ భుజంగమువలె నిశ్చేష్టుఁ గావించెను. పల్లవ సుకుమారకరముల నానావిధ పుష్పములఁ బూజాపాత్రలో నునిచి మెఱుపువలె నదృశ్య మయ్యెను. మనస్స్థైర్యముఁ బోఁ గొట్టుకొన్నాఁ డాజగన్నాథుఁడు. పెదవులు విప్పారినవి. "అమ్మాయీ!" అని పిలువఁ బోయినప్పటికిని మాట పెకలిరాలేదు. విఫలప్రయత్నుఁ డైనాఁడు. అనుష్ఠానముఁ దీర్చుకొని బయటికి వచ్చెను.

నఖశిఖ పర్యంత మాలోచించి, యే కన్యకామణి తన నాట్యభంగిమము చేతముగ్ధునిగావించెనో, యాయమృతస్వరూపిణియే దర్శనమాత్రమున విభ్రమితుఁ గావించెనని తల పోసెను. కళాసంపద కామెనాట్యము సదనము. శృంగార రసమున కామె కామధేనువు. ఇట్టి సమ్మేళన మారసలో భిని లోఁగొనుటలోఁ గల విశేష మేమి? అతనిలో నిపుడు తర్కమె నిలచినది. ఇతరశాస్త్రము లాకర్షింపలేదు. వాద ప్రతివాదములను గుఱించి తర్కముతో నాలోచించు చున్నాడు. ఊహావాదమును హేతువాద మడ్డగించుచున్నది. తుదకొక నిశ్చయమునకు రాఁ గలిగెను. హావభావలీలాతి శయమున నే లలనామణి యొక క్షణమాత్రములోఁ ద న్నుద్రేక పఱచెనో యా మధుర స్వరూపిణియే మఱలఁ బ్రత్యక్షమై యపాంగ వీక్షణముల శరీరముఁ బులకరింపఁ జేసె ననుకొన్నాఁ డా జగన్నాథుఁడు.

ప్రయాణమునకు మనస్సొప్పలేదు. ఉండుట యసం గతము. ఈ రెంటితో డోలాందోళన మానసుఁడై తుదకు

నిరస్తనిర్గమనవాంఛుఁ డయ్యెను. ఆ సౌందర్యరాశి వివాహితయో, కాదో తెలిసికొనవలెనని తలంపు. గృహస్థుతో భరతశాస్త్రమును గుఱించి చర్చ నుపక్రమించెను. ఆయన శాస్త్రమునందలి నిగూఢ రహస్యములను దెలుపుచు జగన్నాథుని సందేహములఁ దీర్చుచుండెను. చివఱకు జగన్నాథుఁడు "కులస్త్రీలు నాట్యము నేర్వవచ్చునా? అయ్యది సాంప్రదాయ వ్యతిరేకము గాదా?" అని ప్రశ్నించెను. అందులకా యగ్రహారీకుఁడు సమాధానముగ "కళ సర్వులకు నొకటియె. అందు తారతమ్యములతోఁ బనిలేదు. కులస్త్రీలు నాట్యము నేర్చినను పరిమిత ప్రయోజనము. వారు వివాహితలైన పిమ్మట నాట్యముఁ బ్రదర్శించుట కవకాశ ముండదు. అందువలన మా వంశ పారంపర్యముగ నచ్చు నీవిద్య నాఁడుబిడ్డలకు సైతము చిన్నతనములో నేర్పెదము. వివాహమైన తర్వాత నేర్పుట మాయాచారము గాదు. ఆవిధముగ నేర్చినవారు తమ సంతానమునకు నేర్ప సమర్థులై యుందురని మాసంకల్పము," అని వివరించెను. అంతటితో జగన్నాథునకు సందేహ నివృత్తి కాలేదు. ధైర్యము చేసికొని "స్వామీ! తమ పుత్రికచేయు నాట్యమును హఠాత్తుగఁ జూచితిని. ఆమె వివాహిత కాదా?" అని ప్రశ్నించెను. అందులకాయన "కా" దని సమాధాన మొసంగెను.

భోజనసమయములో నాకన్యక పదార్థముల నందించుచు, వస్తువుల నటునిటు సవరించుచుండెను. జగన్నాథుని

చూపులా మెప్పైనవె. ఆ సౌందర్యరసమును జూపులతో త్రావుచుండెనేమో! అతఁ డా సందర్భములో నామె పేరు 'కామేశ్వరి' యని యెఱింగెను. పేరులోఁగల స్వారస్య మా రసిక చక్రవర్తికిఁ గడుంగడు మోదావహమయ్యెను. రసికత్వ మే వస్తువునందును గుణమును గ్రహించుటలో వెనుకంజవేయునా? పండితు లెంతైనా రసలుబ్ధులు. చాల నిగ్రహముతో భోజనమును ముగించి, గృహస్థును నమస్కారపూర్వకముగఁ బ్రయాణమున కనుజ్ఞ వేఁడి, మహాచింతాభారాక్రాంతహృదయుఁడై కూచిపూడిని వదలి స్వగ్రామోన్ముఖుఁడై వెడలెను.

కామేశ్వరి కాతని బెదరుచూపులు సంకటకరముగ నుండెను. అమాయకురాలు. ప్రాపంచిక వాసన లప్పుడప్పుడె చుట్టుముట్టుచున్నవి. వేఁటగాని వాఁడి తూపులఁ జూచి, బెదరి గడగడలాడు హరిణమువలె నామె జగన్నాథుని యోరచూపులకుఁ గంపించినది. తనలో నేమైన లోప మున్న దేమోనని పరిపరివిధములఁ బరిశీలించుకొన్నది. ఏమియుఁ దోఁచలేదు. తలుపుచాటున దాఁగి జగన్నాథుఁడు వెళ్ళిపోవుటఁ గాంచెను. ఆమె మనస్సులో నొకవిధమైన గాలిదుమారము చెలరేఁగినది. కని విని యెఱుఁగని విషయము లిప్పు డామె కనులకు తెఱమీఁది చిత్రములవలెఁ గనిపించుచున్నవి. గ్రామములోఁగల పెద్ద లందఱు యువకుఁలైన జగన్నాథుని మహాపండితుఁడని పొగడిరి. ఆ పొగడ్త కామె పరవశురాలయ్యెను. ఆ జగన్మోహనాకార మా

లేఁత వలపుతోఁగూడిన హృదయము నాకర్షింపఁ జాలదా? ఇది గారడి యనుఁడు. ప్రకృతి యనుఁడు. సృష్టిలోని వైచిత్ర్య మట్టిది. సకలప్రాణులు నందులకు లొంగవలసినదె.

జగన్నాథుఁడు గ్రామము చేరెను. తల్లిదండ్రు లతఁడు కృతార్థుఁడై వచ్చినందుల కెంతేని సంతోషించిరి. పుత్రుఁడు యుక్తవయస్కుఁడుగాఁ దోఁచుటచే పాణిగ్రహణమునకు సన్నాహముఁజేయ తలపెట్టిరి. తమవాంఛ దెలుపఁగా నతఁ డందుల కియ్యకొనెను. 'స్వయముగ సాధింపఁగల విద్యలను సాధింపఁగలను. నాట్యవిషయమున శాస్త్ర మవగాహన చేసికొనఁగలను గాని, సాధనము సాధ్యపడదు. మన గృహము సకల విద్యాక్షేత్రమై, లలితకళానిలయమై యుండ వలెనన్న నాట్య మెఱిఁగిన స్త్రీని వివాహము చేయుఁ' డని యభ్యర్థించెను. పేరుభట్టు ముక్కుమీఁద వ్రేలు వైచుకొని "నాట్యమును గులస్త్రీలు నేర్వరు. కావునఁ గన్యక యెట్లు తటస్థించు" ననఁగా, సందేహించుచుఁ దన మనోగతభావ మును జగన్నాథుఁడు వ్యక్తీకరించెను. విద్యావ్యాసంగము నకు వెళ్ళి, యనురూప వధువు నేర్పఱచుకొని వచ్చిన కుమా రుని చాకచక్యమున కాతల్లిదండ్రు లాశ్చర్యమునందిరి. తన వాంఛ నెఱవేఱఁగలదని జగన్నాథుఁడు పరమానందభరితుఁ డయ్యెను.

కన్యకార్థము గోదావరీతీర ప్రదేశమును వదలిపెట్టు కొని, కృష్ణాతీరమువఱకు వెళ్ళుట పేరుభట్టున కిష్టములేదు. బంధుజాలము నంతయు విసర్జింపవలసి వచ్చెను. భార్య

రాయొత్తిడికి లొంగి చేయున దేమియును లేక పేరుభట్లు కూచి పూడికి వెళ్ళి వారి కా విషయమును తెలిపెను. యుక్త వయస్కుఁడు, స్ఫురద్రూపి, మహాపండితుఁడుం దమకు నల్లు డుగ లభించుచున్నందుల కా కామేశ్వరి తల్లిదండ్రు లెన లేని కౌతూహలముఁ బొందిరి. కర్ణాకర్ణిగ నావిషయ మెటిఁ గిన కామేశ్వరి పరిస్థితిని వివరింప సాధ్యమా? చూపు లై పోయినవి. మాటలన్నియు ముగిసెను. ముహూర్తము నిర్ధరింపఁబడినది.

పెండ్లి ప్రయత్నములన్నియుఁ జేసికొనిరి. కూచి పూడి యగ్రహారములోనే పాణిగ్రహణ మహోత్సవము వైభవోపేతముగ జరుపఁబడినది. కన్యాదాన సమయమున నల్లునకు నరణముగ ననేక గోవులను, బంగారములు పండు కేదారంబులను, గృహములను గన్యాదాత యొసఁగినాఁడు. విధ్యుక్తముగ నన్నియు జరిపిరి. ఆ వధూవరుల పరస్ప రేక్షణములలో భవిష్యద్దాంపత్య జీవన సౌధమునకు సోపాన ములు గట్టుకొనిరి. వివాహమంగళము సమాప్తమయ్యెను.

---

## ౨

నాకబలినాఁడు సహజముగ సంభవించు నిష్ఠూరములు లేకనే వివాహము ముగియుటచేత మూఁతి విఱుపులతో నిమిత్తముండదయ్యె. బంధువు లెవరిగ్రామములకు వారేగిరి. వివాహముఁ గన వచ్చినవా రెల్ల నుత్తమదాంపత్యమని శ్లాఘించిరి. జగన్నాథు నచటనె వదలి స్వగ్రామమునకు

వెళ్ళినా రామేరుభట్టు దంపతులు. జగన్నాథుఁడు చిరపరి చితుఁడగుట నా గ్రామమున నెట్టి బిడియమును లేక మెలఁగు చుండెను. వంశపావనకరుఁడైనట్టి యల్లుఁడు లభించెనను సంతోష మా కామేశ్వరి తల్లిదండ్రులకు. వారతని శరీరము పై నీఁగ వ్రాలకుండఁ గాపాడుచు, విచారించు చుండిరి. అపూప విశేషములతోడను, రుచికర భోజ్యవిశేషముల తోడను జగన్నాథుని రుచికే వెగటుపుట్టెను. క్రొత్త యల్లునికిఁ జేయవలసిన మర్యాదల కా గృహములో నిసుమం తయు లోపము లేదు.

ఆ లేఁతవలపులఁ దూఁగు హృదయములలో పరస్ప రాకర్షణశక్తి నానాఁటికి నధికతర మగుచుండెను. ఒకరిపై నొకరు పందెములు వైచుకొన్నట్లు చూచుకొనుచుండిరి. వారి చేష్టలకు మధ్యమధ్య సిగ్గనియెడి తెఱ జాఱుచుండెను. అయినను సాహసమును జేయుచుండెడివారు. వలపు తలఁపు లధిక మగుచుండెను. మూఁగ సైఁగలు చేసికొన సాగిరి. కాలము నధిక కష్టము మీఁదఁ గడుపక తప్పలేదు. ఒకరి సౌందర్యము నొకరు చూచుకొని యువ్విళ్ళూరుచుండి రన్న విశేష మేమి కలదు? అది ప్రపంచ సహజము. కామేశ్వరిలో ప్రణయ సామ్రాజ్య రేఖలు ప్రస్ఫురించినవి. వాని నేలుబడి సేయు జగన్నాథునకుఁ గాల మనుకూలముగ లేదు.

ఆఱుమాసములు గడచినవి. "శ్వశుర గృహమ్ పరమ సుఖమ్" అను లోకోక్తి ననుభవములోఁ దెలిసి కొన్నాడా జగన్నాథుఁడు. కామేశ్వరి ప్రభావములోఁ బడి

తల్లిదండ్రులను మఱచెను. కొన్ని దినములు గడచిన పిమ్మట నత్తమామలచే సెలవు పుచ్చుకొని, ముంగొండకుఁ బయన మై పోయెను. రెండు మూఁడు మాసములైన కాక మునుపే కూచిపూడినుండి యొకపురోహితుఁ డరుదెంచెను. అతనిఁ జూడఁగనె జగన్నాథునకుఁ గలిగిన యానందమునకు మేర లేదు. శుభసూచనములు పొడఁగట్టినవి. వృద్ధపురోహితుఁడు ముసిముసినగవులు నగుచు జరుగఁబోవు ప్రణయ సామ్రాజ్య నాటకమునకు నాందిగ నూత్న వస్త్రాదులను జగన్నాథునకుఁ బ్రసాదించెను. పురోహితుని యథావిధిగ సత్కరించి, శుభ ముహూర్తమును నిర్ణయించి సాగనంపిరి.

ఇప్పు డా దంపతుల మధ్య యేర్పడియున్న సిగ్గనియెడి యవనిక తొలఁగిపోయినది. హృదయము లైక్యము లైనవి. వారిరువుర నొక నూతనోత్సాహము పుట్టుకవచ్చెను. ప్రణ యాంకురము మొలకెత్తి, తీఁగయై, యల్లుకొని, చిగిర్చినది. ఇక పుష్పించుటయె మిగులు.

భార్యాసమేతముగ గృహప్రవేశోత్సవమునకై జగ న్నాథుఁడు ముంగొండ కేతెంచెను. లాంఛనములు జరుపఁ బడినవి. కామేశ్వరి తల్లిదండ్రు లప్పగింత లొనర్చిరి. కామేశ్వరిలోఁ జింతాసుఖములు ద్వంద్వయుద్ధము చేయ సాగెను. తల్లిదండ్రులను వదలుచున్నా ననియెడి చింత. భర్త సాన్నిధ్యము లభించిన దను సంతోషము. కడకు సంతో షమే చింతను జయించెను. అశ్రుపూర్ణ నయనయై తల్లి దండ్రుల సాగనంపెను. 'ఎంతకాలము పెంచినను గన్య

పరులసొత్తే కదా?' అని యొక నిట్టూర్పు విడిచి కామేశ్వరి మాతాపితృలు వెళ్లిపోయిరి.

శ్రీలక్ష్మి కోడలికి నింటిపనులన్నియు నేర్పుచుండెను. గృహిణీధర్మములను బోధించి, యావిధముగ మెలఁగఁ గోరెను. కొడుకును, గోడలిని రెండుకన్నులవలె శ్రద్ధగఁ జూచుచు, తన కబ్బిన మహాభాగ్యమున కామె గర్వించుచుండెను. కామేశ్వరికూడ తలలోనినాలుకవలె నత్తమామల మాట కెదురాడక, భర్త యాజ్ఞకు లోఁబడి యుండుటను జూచి ప్రజ లామె సుగుణసంపత్తిని గొనియాడుచుండిరి. జగన్నాథుఁడు గృహకార్యములఁ జూచుకొనుచు, విద్యాభ్యాసంగముఁ జేయుచు, భార్యపై నెక్కుడు మక్కువఁ గలిగి యుండెను. పేరుభట్టు తన యదృష్టమునకు సంతోషితాంతరంగుఁ డయ్యెను.

ప్రోడువారిన యసూయావృక్షము మఱల చిగిర్చినది. శత్రువు సిరిసంపద లెవరి కన్నుఁ గుట్టింపవు? పేరుభట్టు నణఁగఁద్రొక్క, దలఁచుకొన్న యా బ్రాహ్మణుల కతని శ్రేయము గిట్టలేదు. జగన్నాథుఁడు పండితుఁడై నందులకె వగచుచుండిరి. ఆతని వివాహము, వారి యనుకూలదాంపత్యము గోరుచుట్టుపై రోఁకటిపోటువలె నయ్యెను. ఎటులనైన నాఘాతములఁ గలిగించుటయె వారి తలంపు. అందులకుఁ దగిన యదనుకొఱకు కాచుకొనియుండిరి. పూర్వము ముగించిన యధ్యాయమును దిరిగి ప్రారంభింప వీలుకలిగెను. భరతనాట్యమువల్ల మనుగడ సాగించు కూచిపూఁడి యగ్ర

హారమువారి వియ్యము నాధారముగఁ గొని బహిష్కార ప్రయత్న మేల చేయఁగూడదు? ఈ ప్రశ్న వారికి నిద్రాహార ములు లేకుండ బాధింప మొదలుపెట్టెను.

ఆ గ్రామములో నుండిన యొక వడ్డెవాఁడు తళ్లికోట యుద్ధములో విజయనగరరాజుల పరముగఁ బోరాడి, తన శూరత్వమునకుఁగా ననేక బహుమానములు పొంది బ్రతికి బయటపడి వచ్చెను. వాని యాకారము కాళికాశక్తి యాకా రమువలె భయంకరము. అతఁడు బహుమానముగఁ బొందిన ధనముచేఁ గొన్ని మేకల, నావుల, నితరపశువులఁ గొని యా గ్రామములో నొక మోతుబరిరైతుగఁ బేరుపడెను. ధనగర్వముతో నతఁ డెవరిని లెక్కించువాఁడు కాఁడు. నాఁటినాఁటికిఁ బ్రతాప మతిశయించుచుండుటచేఁ బాళెగాఁ డని పిలువఁ జొచ్చిరి. అన్యాయాపరులైన బ్రాహ్మణులు వానిని చేరఁ దీసి తమ పగ సాధింప నిశ్చయించుకొనిరి. మతకారణము పెట్టినఁగాని తమకుఁ బ్రజాబలము చేకూరదని యెఱింగియే కులబహిష్కార మను కుయుక్తిని మఱలఁ బన్నసాగిరి.

జగన్నాథునకు గ్రామజీవితములో ప్రతిఘటింపవలసిన సమస్యలయందుఁ గేవలము శ్రద్ధ లేకుండెను. అతని కీ వ్యవస్థ బాగుగఁ దట్టలేదు. మనస్సులో నెన్నివిధములైన వ్యాకులము లున్నను గామేశ్వరి దర్శనమాత్రముననె మఱచువాఁడు. ఒకనాఁ డతనికి నాట్యముఁ జూడవలయు నను కౌతూహలము గలిగినది. తల్లిదండ్రులు పొలము చూచుటకై వెళ్లినప్పుడు

భరతనాట్యము చేయవలెనని భార్యను గోరినాడు. ఆమె యందుల కంగీకరించినది. భర్త తాళము గొట్టుచుండ కామేశ్వరి నాట్యము సేయఁ దొడంగెను. ఆ రసపారవశ్య ములో నిర్వురు మునిఁగి తేలుచున్నారు. ఆపాదతాళధ్వనుల విని గ్రామప్రజలందఱు నింటిచుట్టు మూగినారు. ఆ విషయము నా రసికదంపతులు గమనించలేదు. కొంతవడికి నాట్యమును గామేశ్వరి ముగించెను.

బ్రాహ్మణుల కవకాశము చిక్కినది. 'వారకాంతలు నాట్యముచేయవలెఁ గాని, కులస్త్రీలు నాట్యముచేయుట శాస్త్రవిరుద్ధము. కాఁబట్టి వెంటనే పేరుభట్టు కుటుంబమును బహిష్కరించవలెను' అని వాదించుటకుఁ బ్రారంభించి, గ్రామప్రజల నెల్ల రావించి, సభచేసి తీర్మానించిరి. ఇందులకు నాయకునిగా పాళెగాని నియమించి, బ్రాహ్మణులు వెనుక వైపునుండి కథ జరిపించుటకుఁ బూనుకొనిరి. ఈ గాలి దుమా రమునకు పేరుభట్టు మిగుల విచారపడెను. జగన్నాథుఁడు ధైర్యముగ నుండుమని చెప్పి గ్రామప్రజల కెదురొడ్డ తీరు కొనెను. కులబహిష్కారమునకుఁ బేరుభట్టు తలయొగ్గకున్న పన్నులిచ్చుట లేదని బెదరించిరి. జగన్నాథుఁడు కులస్త్రీలు నాట్యమాడుట శాస్త్రసమ్మతమేనని వాదించుచు వారల ప్రతిఘటించెను.

ప్రజలు పన్నులీయ నిరాకరించిరి. దానితో జగన్నాథుని మనస్సు చెదరిపోయెను. ఏమిచేయుటకు నతనికిఁ బాలుపోలేదు. రాజమహేంద్రవరమునకు వెళ్లి రాజోద్యోగిఁ

బిలుచుకవచ్చుటకుఁ బ్రయత్నించెను గాని, రాజకీయకారణ ములచే నా ప్రయత్నము నెరవేరదయ్యెను. అసహాయ శూరుఁడై భవిష్యత్తును గుఱించి తీవ్రముగ నాలోచింప మొదలుపెట్టెను. పన్నులు రాకున్న జీవనాధార మేమి? ఆ నవదాంపత్యసౌఖ్యమున కిది యశనిపాతము. కింకర్తవ్యతా విమూఢుఁడై జగన్నాథుఁ డహర్నిశ లాలోచింపసాగెను.

---

౮

క్రీ. శ. 1510 సం. ప్రాంతమున విజయనగరములో నాంధ్రసామ్రాజ్య సింహాసనము నధిష్ఠించినాడు శ్రీకృష్ణ దేవరాయలు. తిమ్మరుసు మంత్రి రాజ్యతంత్ర నైపుణ్యము వెన్నెముక కాఁగా రాజ్యమేలుచుండెను. రాజకుటుంబములో చెలరేఁగిన యశాంతి ఫలితముగా దేశములో నచ్చటచ్చట తిరుగుబాటులు ప్రారంభమైనవి. మొగల్ సామ్రాజ్య చ్ఛాయలు దేశములో నలుమూలల వ్యాపింపసాగెను. బహమనీ సులతానులు విజయనగరోత్తర ప్రదేశముఁగల రాయచూరు, బిజాపురము, గుల్బర్గా మొదలగు ప్రదేశములలో బలవత్తరులై యాంధ్రసామ్రాజ్యమును గబళింప నువ్విళ్ళూరుచుండిరి. రాయలు కొంతకాలము పాటు రాజధానిలోనే యుండి సామ్రాజ్యమును భద్రపఱచుకొను చుండెను. అడపదడపఁ బ్రజ్వరిల్లు కల్లోలముల నడఁచుచు, సైనిక

సమీకరణము గావించి, సామ్రాజ్యార్థిక పరిస్థితిని చక్క బఱచుకొనెను.

క్రీ. శ. 1511 సం. లో ప్రప్రథమ దండయాత్రను ప్రారంభించి కావవు లేలుకంచిపై దండయాత్ర వెడలెను. వానిలోఁబఱచుకొని *"ఉమట్టూరు" నేలు గంగరాజుపై దుమికెను. అతని వశంవదునిగఁ జేసికొని, శ్రీరంగపట్టణము, †ఇక్కేరి మీఁదుగా బిజాపురము సరిహద్దులలోఁ బ్రవేశించి, బిజాపురపు సుల్తానుల జయించి ముద్గల, రాయచూరు మున్నగు ప్రదేశములను హస్తంగత మొనర్చుకొనెను. బిజాపురముపై దాడివెడలవలె నని రాయల యాశ. తిమ్మరుసు కళింగ దేశాక్రమణ మనంతర లక్ష్యమని చెప్పఁగా రాయలు విజయోత్సాహముతోఁ దిరిగి 1512 సం. విజయ నగరముఁ జేరుకొనెను.

శ్రీ కృష్ణదేవరాయలు రాజ్యములపై దండెత్తుటలో దురాక్రమణముగాని, రాజకీయ దురుద్దేశ్యములుగాని లేవు. పూర్వపు విజయనగర సరిహద్దులను మఱల సంపాదించుటయే యతని ప్రధానలక్ష్యము. ఎటులనైనఁ గృష్ణానది కావలి దిక్కునఁ దన సామ్రాజ్యస్థాపనముఁ జేయవలయునని కోరిక. ప్రతాపరుద్ర గజపతిపై దాడివెడలి దక్షిణాపథమున కీలక స్థాన మాక్రమించుకొన్న కొండవీటిని స్వాధీనపఱచుకొనెను. మూఁడవ జైత్రయాత్రను నొరిస్సాదేశమును గమ్యస్థాన

* తూర్పు మైసూరు ప్రాంతములోఁ గలదు.

† మైసూరు సంస్థానములో షిమోగా జిల్లాయం దున్నది.

ముగా నిడుకొని † కొండపల్లిని ముట్టడించి, * సింహాచల ములో విజయస్తంభమును బ్రతిష్ఠించెను.

ఎచటికి వెళ్లినను జయశ్రీని బడసినవాఁడై శ్రీ కృష్ణ దేవరాయలు విజయనగర సామ్రాజ్య ప్రతిష్ఠ నినుమడింపఁ జేసెను. దాదాపు కృష్ణకు దక్షిణాపథమంతయు నతని సితాతపత్రచ్ఛాయలోనికి వచ్చెనన్న వేఱుగఁ జెప్పనేల? మూఁడు ప్రధాన భిన్న సంస్కృతు లతని రాజ్యములో లీనమైనవి. ఆంధ్ర, తమిళ, కర్ణాటములు. అందఱును రాయలను సమానముగనె గౌరవించుచుండిరి. తిరువాన్కూరు, మలబారులు కాక నా ప్రాంతపుఁ బరిపాలకులు సైతము రాయల పలుకు బడిలో నుండిరి. ఎవరి నాయన యసంతృప్తిని బఱుచలేదు. అన్ని భాషా ప్రాంతములను సమాన గౌరవముతోఁ జూచు చుండెను. కాని బిరుదము మాత్రము కర్ణాటాంధ్ర సార్వభౌముఁడు.

ఆనాఁటి విజయనగర సామ్రాజ్యైశ్వర్యము, వ్యాపారము సయితము విదేశయాత్రికుల నాశ్చర్యచకితులఁ గావించినది. గోవా నాక్రమించుకొన్న పోర్చుగీసు వారితో సౌహార్దమును సంపాదించి రాయబారి నచటికి శ్రీ కృష్ణదేవ రాయలు పంపెను. పోర్చుగీసువారు స్వేచ్ఛగా దిగుమతులు చేయుచు విజయనగరములో వ్యాపారమును సాగించుచుండిరి. నాఁడు దక్షిణాపథములోకెల్ల ముఖ్యవ్యాపార

† కృష్ణామండలమునఁ గలదు.

* విశాఖమండలమునఁ గలదు.

కేంద్రము విజయనగరము. ఈ కారణమువల్ల సామ్రాజ్య గౌరవము విస్తరితమయ్యెను. రాజధానిలోని యైశ్వర్యము, బలము, విహారములు, భవంతులు, నుత్సవములు వర్ణనాతీతములు. † "ఆ పట్టణములో ప్రతి దేశమునకును, ప్రతి జాతికిని సంబంధించిన పురుషులుండిరి, ఎందుకన గొప్ప వ్యాపార కేంద్ర మగుటచేత. నా దృష్టిలో రోము మహా నగరమువంటి వైశాల్యము గలది. చూచుట కందమైనది కూడా. ప్రపంచములోఁ గల యుత్తమనగరములలో నొకటి. కాపురముచేయు నొక లక్ష నివేశములందుండెనన్న నింకఁ బ్రత్యేకముగఁ బేర్కొన నవసరము లేదు." అయిదు లక్షల పౌరులతో నాపురము కళకళలాడుచుండెను. ఆంధ్రమాత విశృంఖల విహారము నోఁచుకొన్నదా నగరరాజము.

ఆంధ్రకవితాకన్య యౌవనపు టొయ్యారముల నచటనె విజృంభించినది. అష్ట దిగ్గజములు వెలసిరి. వివిధాంధ్ర కవితాప్రసూనము లాంధ్రక్షేత్రములో ఘ్రాణ తర్పణము లయ్యెను. ఆంధ్రభాష యుచితాదరముఁ గాంచినది. రాయలు స్వయముగ విద్వాంసుఁడు. సమస్త కావ్యరీతుల నాఱితేఱిన మహాకవి. ఆతని గీర్వాణకవితా ధౌరంధర్యమునకు సాక్షిభూతములే జాంబవతీ కళ్యాణ ముషాపరిణయాదులు. ఆంధ్రమున నుజ్జ్వల ప్రబంధమని పేర్కొనఁబడిన యాముక్తమాల్యద రాయల సిద్ధహస్తమునుండి జాలువారిన కవితాస్రవంతియె. కొందఱు కర్ణాటకవులు గూడ

† ఒక విదేశయాత్రికుని కథనము.

విజయనగరాస్థానమందు గౌరవింపఁబడిరి. తమిళము సైతము రాయల యభిమానమును బొందెను. హరిదాస, కుమార సరస్వతు లాదరింపఁబడిరి.

లలితకళలన్నియు నాఁడు రాజాదరణపాత్రము లయ్యెను. సంగీతముగూడ భువనవిజయములో ప్రత్యేకత నందుకొన్నది. విఠలస్వామి దేవాలయము శిల్పకళాసంపదకు నిలయము. కాలకుఁ బ్రాణములుపోయఁగల కళానైదగ్ధ్య మానాఁటి శిల్పుల కబ్బినట్లు సాక్ష్యమున్నది. హజారరామ స్వామి దేవాలయము రాయలకు ప్రత్యేక ప్రేమాస్పదము. ఇది యది యని వర్ణింప నలవికాదు. ఆంధ్రుల సామ్రాజ్య మున కదియె తుది దశ. ఆంధ్ర సారస్వత ప్రపంచములో నదియె స్వర్ణయుగము. దేశభాషాభివృద్ధి కా కాలమె చరిత్ర ప్రసిద్ధము. శిల్పకళావికాసమున కదియె చరమాధ్యాయము. ఎట్లైననేమి రాయ లాంధ్రసంస్కృతికి విశ్వవిఖ్యాతి సమ కూర్చెను. అతని ఋణ మెన్నటికిని దీర్పలేము. తాను వైష్ణవమత మవలంబించి యున్నప్పటికిని శైవమును గౌర వించినాడు. ద్వైతమతవ్యాప్తి నరికట్టలేదు. ఇట్టి సకల మత సమానభ్రాంతి రాజులలోనుండుట మహా విశేషము.

ఆంధ్ర ప్రాభవము ఢిల్లీ మొదలు దక్కనువఱకుఁగల రాజుల కసూయాగ్రస్త మయ్యెను. ఒకవైపు విజాతిరాజ్య పాలనకు తమిళ, కర్ణాట, కేరళులు తీవ్రాసంతృప్తితో నుండిరి. వారు రాయల ప్రతాపాగ్నిజ్వాలలకు శలభ సదృశులైరి. సమయము దొరుకలేదు. వీలున్న విజృంభింప

వలయుననియె వారల తలంపు. రాయలు దేశాక్రమణ వాంఛను వదలుకొనెను. అతని కొకవిధమైన తృప్తికలిగినది. యుద్ధములచే విసిగి విశ్రాంతి గైకొనుచున్నాడు. కళాపోషణ మునకు బద్ధకంకణుం డయ్యెను. ఆ దీక్ష పరిసమాప్తము కావచ్చినది. చేయవలసిన ముఖ్యకార్యము లన్నియుఁ జేసినాడు.

కాలప్రభావము విచిత్రమైనది. ఇఱువది సంవత్సరము లేకచ్ఛత్రముగఁ గటకము మొదలు కన్యాకుమారీ యగ్రమువఱకు రాజ్యమేలిన యాంధ్రసార్వభౌముఁడు కనుమూసినాడు. అంతఃపురము ఘొల్లుమన్నది. ప్రజలు రాజభవనముచుట్టు మూగిరి. నేల యీనిన చందమున జనము వచ్చుచుండెను. ఇసుకఁజల్లిన నేలపై వ్రాలకుండెను. కవులు తమ కావ్యలతావికాసమునకు గొడ్డలిపెట్టుగ భావించిరి. కళాజీవులు రాయలమరణము కళాభివృద్ధికి భరతవాక్యమను కొనిరి. రాజ్యము నపహరింపఁ గుతంత్రములు పన్ను రాజబంధువర్గము లోలోన సంతసించెను. రాజమర్యాదలతో శ్రీకృష్ణదేవరాయలకు సంస్కారమును జరిపించిరి. ప్రకృతి కూడ నానాఁడు శోకించెనన్న నతిశయోక్తి కాదు.

భవిష్య దాంధ్రసార్వభౌముఁ డెవఁడన్నది ప్రశ్న. ఇది చాల చిక్కు సమస్యలతోఁ గూడికొని యుండెను. రాయల యల్లుఁడైన యళియరామరాజు కుతంత్రములలో ప్రధానపాత్రఁ గైకొనెను. రాజబంధువులలో ననేకపక్షము లేర్పడినవి. ఎవరికివారుగఁ బ్రయత్నించుచుండిరి. ఇంతకు

విప్లవజ్వాలలు బహిర్గతమయ్యెను. దేశములో నింతవఱకు బోనులోఁ జిక్కిన పులులవలెనుండిన సామంతరాజులు విజృంభించిరి. రాజ్యమందంతటను విప్లవజ్వాలలు ప్రజ్వరిల్లెను. అణఁచుట కష్టసాధ్యము. ఈ పరిస్థితిలో పరాజయ పరాభవముచే మంటలు గ్రక్కుచుండిన బహమనీసుల్తానులు తలలెత్తిరి. ఏదో యొక ప్రళయము విజయనగర సామ్రాజ్య పీఠమును గబళింప నుండినట్లు ప్రజలకుఁ దోఁచుచుండెను.

---

౯

శ్రీ కృష్ణదేవరాయ లొక మహావ్యక్తి. ఆయన రాజ్య పాలనములో విజయనగర సామ్రాజ్య గౌరవ మభివృద్ధి చెందెను. ఎంతటి రసికుఁడో, యంతటి రాజ్యాంగ వేత్త. తన గొప్పతనముచేత సామ్రాజ్యముయొక్క యార్థిక పరిస్థితిని చక్కబఱచెను. సంస్కృతికిఁ బ్రత్యేకత నిలువఁ బెట్టెను. వైదేశికుల నాదరించువాఁడు. వారితో నా యా దేశముల మంచిచెడ్డలను గూర్చి ప్రశ్నించుచుండెను. అతని యనంతర మా ప్రత్యేకగుణములు శ్వశురుఁడైన యళియ రామరాజులోఁ గొంతవఱకుఁ బొడచూపినవి. సార్థకము మాత్రము కాలేదు. ఇందుల కతని శీలమె కారణమై యుండునేమో!

రాయలు మరణించుట తోడనే దేశములో నలు మూలల విప్లవజ్వాలలు రగులుకోసాగెను. 1530 సం. ములో

నచ్యుతదేవరాయలు సింహాసనము నెక్కెను. ఆతఁడు దుష్టస్వభావుఁడు. గౌరవహీనుఁడు, భీరువు, ప్రజోపద్రవకారి. అందుచే పెద్ద లతనివలన సామ్రాజ్యమునకు వినాశము తప్పదని భావించుచుండిరి. ఆయన రాజ్యములోని ప్రథమదశ యంధకార బంధురము. సింహాసన మధిష్ఠించిన సంవత్సరముననే ఇస్మాయిల్ ఆదిల్ షాచేత రాయచూరుదుర్గము నోడిపోయెను. దేశాంతరంగిక శాంతి చెడుటయు నిందులకొక కారణము. ఒకవైపు తిరువాన్కూరు రాజు సహాయమును బొందినవాఁడై చోలదేశపు రాజప్రతినిధి విప్లవమునకుఁ గారకుఁడయ్యెను. తర్వాత తన బావమఱఁదిని చోలదేశమునకుఁ బంపి శ్రీరంగములో స్థావర మేర్పఱచుకొనెను. విప్లవకారు నడఁచి, తిరువాన్కూరు ప్రభువును వశంవదుఁ గావించుకొని రాఁ గలిగినాఁ డా బావమఱఁది. అచ్యుతరాయల పాలనలో నుత్తరార్ధమున బావమఱఁదులైన సలకరాజు, తిమ్మరాజుల యిష్టానుసారముగ రాజ్యమేలుచుండెను. ఆయనకు వ్యతిరేకముగ నళియరామరాజు తన సహోదరులైన తిరుమల, వేంకటాద్రుల సాహాయ్యమున సదాశివరాయలకు రాజ్యమప్పగించమని యధికారదుర్వ్యామోహితుఁడై ప్రతిఘటింపఁ జొచ్చెను. శత్రుల కిది యొక యవకాశము.

సమయమునకై కాచుకొని యున్న బిజాపురము సులతానులీయవకాశము నుపయోగించుకొనిరి. రాజ్యాంతరంగిక వ్యవహారములలో చేయికలుగఁజేసికొనుటయే

వారియుద్దేశ్యము. ప్రథముఁడైన ఇబ్రహీం విజయనగరముపై దాడి వెడలి † నాగలపురమును విధ్వంసమొనర్చెను. రామరాజు వ్యతిరేకమప్పటిలో ఫలప్రదము కాలేదు.

సదాశివరాయలతండ్రి రంగరాయలను గొంద అచ్యుతరాయల జ్యేష్ఠపుత్రునిగ ననుకొనుచుండిరి. అందుచేత నచ్యుతరాయల కుమారునకన్న సదాశివరాయలే సింహాసనము నెక్క నవకాశముండెను. 1542 సం. లో నచ్యుతరాయలు మరణించుటతోడనే పెద్ద సంక్షోభము. సింహాసనము, పట్టాభిషేకము సదాశివ, వెంకటరాయలమధ్య నెవరికి దక్కవలె ననునది సమస్య. రాజ్యపరిస్థితులు సందిగ్ధస్థితిలోనుండి, ప్రజోపద్రవము సంభవించుటచేత బిజాపుర సుల్తానులు ప్రవేశించిరి. అప్పటిప్రజోపద్రవము నడంచి, సదాశివరాయలకె విజయనగర సామ్రాజ్యమకుటము నుంచి, మూర్ధాభిషిక్తుఁగావించి తాను రాజప్రతినిధిగా రామరాజు పరిపాలనము చేయసాగెను.

శ్రీకృష్ణదేవరాయల కాలములో రామరాజు సైనికాధికారిగా నుండెను. తన యుద్ధప్రవీణతా లక్షణములన్నింటిని సదాశివరాయల సింహాసనారూఢుం జేయుటలోఁ జూపి ప్రాబల్యమును నిల్పుకొన్నాడు. 1542 సం. మొదలు 1550 సం. వఱకు రాజప్రతినిధిగా నుండి, తన సహోదరుల సహాయముతో రాజ్యమును నడపెను. ఆతర్వాత సదాశివరాయ

† నేఁటి హాస్పేట.

లనే చెఱసాలలోఁ బెట్టి రాజమర్యాదలు జరిపించుచు, సంవత్సరమున కొకమాఱు ప్రజలకు దర్శన మిప్పించు చుండెను.

రామరాజు తానె స్వయముగ రాజ్యమంతయు నడుపువాఁడు. దక్షిణాపథమున రామేశ్వరము చెంత పోర్చుగీసువారి ప్రాబల్య మధికమై యచ్చటి ప్రజలు క్రిస్టియను మతమును స్వీకరించుచుండిరి. మధుర నాయకు లొకవైపు విజృంభించుచుండుటను గమనించిన రామరాజు తమ్ములఁ బనిచెను. విఠల, చిన్న తిమ్మరాయం డచ్చటి కేగిరి. తిరువాన్కూరు ప్రభువు విజయనగర రాజ్యమునకు లోఁబడి యుండి కప్పముఁ గట్టుట కొప్పుకొనెను. రామరాజు కన్యాకుమారి యగ్రముచెంత విజయస్థంభము నెత్తించుట సారస్వతములోఁ గీర్తింపఁబడినది.

బహమనీ సులతానుల రాజ్యము మూఁడుపాయలుగఁ జీలిపోయెను. బిజాపురము, గోల్కొండ, అహమ్మద్‌నగరు లేర్పడినవి. వారిలోఁ గలిగిన వైవిధ్యము నూఁతగాఁ గొని రామరాజు స్వేచ్ఛగాఁ బ్రవర్తించుచుండెను. ఒకేవిధాన మవలంబింపలేదు. కొంతకాల మొకరివైపు కొంతకాలము మఱియొకరివైపు. వారును దమ స్వార్థమున కితని నుపయోగించుకొనుచుండిరి. ఆలి ఆదిల్‌షా నిర్మించిన కూటమిలోఁ బ్రధానపాత్రఁ గైకొని రామరాయ లహమ్మద్ నగర్‌కు వ్యతిరేకముగా పోరాడెను. ఆసందర్భములో నచటి ప్రజల హృదయములు మండునట్లు వారల విశేషనష్టముల పాలు చేసెను. అదియే విజయనగరముయొక్క విధ్వంసాత్మకమైన

దాడులలో మొదటిది. దానివల్లనే అహమ్మద్ నగర్ ముస్లి ములలో మతసంబంధమైన దురభిప్రాయములు రేకెత్తెను. మఱల నొకమాఱు బిజాపురము నైపుచేరి అహమ్మద్ నగర్పై రామరాజు దాడిచేసెను. పూర్వపు నరాజకము పునరావృత్తము. ఈపర్యాయములో ననేకవిధములగు ఘోర కార్యములు జరుపఁబడినవి. ఇదియె సులతానుల రాజ్య సమీకరణకుఁ ద్రోవతీసినది. బహమనీసులతానుల క్రోధాగ్ని జ్వాలలకు తోడుగా మొగల్ సామ్రాజ్యాసూయా వాయు వులు ప్రోత్సహించినవి. విజయనగరరాజ్యము విధ్వంసమైన కాని తమతమ రాజ్యవిస్తృతికి, స్వతంత్రతా ప్రకటనకు నవకాశములేదని యొకరితో నొకరు మాట్లాడుకొని కూటమి నేర్పఱచుకొనిరి. తళ్ళికోటయుద్ధముతో విజయ నగర సామ్రాజ్యభానుఁడ స్తమించెను.

రామరాయలు యుద్ధమునందే మరణించెను. వేంక టాద్రియు నంతె. తిరుమలరాయని కన్ను లొట్టపోయెను. తళ్ళికోటయుద్ధములో జయించి సులతానులు విజయగర్వ ముతో విజయనగరముఁ బ్రవేశించిరి. మంటలతోను, గత్తుల తోను, గడ్డపాఱలతోను, గొడ్డండ్రతోడ నెడతెగకుండ విధ్వంసక కార్యకలాపములు గొనసాగించిరి. అంతటి మహా నగరము శ్మశానవాటివలె నయ్యెను. ప్రపంచచరిత్రలో నింతటి ఘోరపరిస్థితి కొన్నిదినములలో నేమహానగరమునకుఁ గలుగలేదు. కలిగిన నింతటి హఠాత్తుగా మహైశ్వర్యముతోఁ దులతూఁగునది, పారిశ్రామికజనులతో నిండినదియైన మహా

నగర మిట్టి నాశనము నందుట † చరిత్రలోఁ గని విని యెఱుఁగము. అచట జరిగిన హత్యాకాండ, రక్తపాతము, దోపిళ్ళు వర్ణింపరానివి. ఆ విజయనగర సౌభాగ్యము కాలగర్భములో లీనమైనది. రెండుశతాబ్దము లమోఘముగఁ బ్రవర్ధిలిన విజయనగరము నేఁడు శిధిలావశేషము.

తిరుమలరాయలు తానె రాజప్రతినిధిత్వమును బ్రకటించుకొని, విజయనగరము వదలివెళ్ళెను. సులతానులు తమ విధ్వంసకకార్యకలాపములు ముగించుకొని, విజయనగరము వదలి తమతమ నెలవులకుఁ జేరుకొనిరి. తిరుమలరాయలు మఱల శిధిలమైన విజయనగరముఁ బ్రవేశించెను. ప్రజలఁ బిలిపించి, సామ్రాజ్యమును బునరుద్ధరించుటయె యాతని యాశయము. తనయాశ ఫలింపకఁ బోవుటచే విజయనగరమునుండి రాజధానిని పెనుగొండకు మార్చుకొనెను. పట్టాభిషిక్తుఁ డగుటచే దానితోఁబాటు బాధ్యతలు పైఁబడినవి. అందుచేఁ దనకుమారులగు శ్రీరంగ, రామ, వేంకటరాయంద్రకు క్రమముగ నుదయగిరి, సెరింగపట్నము, చంద్రగిరి యేర్పఱచి పనిచెను. తిరుమలరాయల యనంతరము శ్రీరంగరాయలె పెనుగొండరాజు. ఇతఁడు తన కాలములో పెనుగొండను వదలి చంద్రగిరినె శాశ్వతరాజధానీ నగరముగఁ జేసికొనెను. ఆదిల్‌షా పెనుగొండను ముట్టడించి కడకు శ్రీరంగరాయల బంధించెను. ఎంతయో

† 1945 వ సంవత్సరమున ముగిసిన ద్వితీయ మహాప్రపంచ సంగ్రామములోఁ దప్ప.

థన మొసంగి చెఱనుండి బయటపడినాడు. గోల్కొండ సులతానులు గుంటూరుమండలము, కొంత నెల్లూరు మండలము, కడప, కర్నూలు, బళ్ళారి, యనంతపురమండలముల నాక్రమించుకొనిరి.

రెండవ వేంకటరాయలు చంద్రగిరిలో రాజ్యమేలుచుండెను. ఆంధ్రదేశములో నచ్చటచ్చట విప్లవములు చెలరేఁగుచుండెను. ఒకనైపు సులతానుల యొత్తిడి, ఆంధ్ర రాజ్యలక్ష్మి యడవులఁ బట్టినది. కవితాలత వాడుబాఱినది. రాజులేని రాజ్యము. పోడుగుచేతుల పందేరమువలె బలవంతుఁడు గ్రామము నాక్రమించుకొనసాగెను. వేంకటరాయలు విజయనగరసామ్రాజ్యమును బునరుద్ధరింపఁ దలఁచెను సాధ్యపడలేదు. సదాశివరాయలను దిరుమలరాయల కుమారు లెవరో రాజ్యకాంక్షతోఁ జంపినారను ప్రవాదము. దానిచే నాంధ్రులకుఁ దిరుమలరాయల సంతతిపై నసూయ. ఆ మచ్చ యెంత ప్రయత్నించినను మాయలేదు. వేంకటరాయలు పోర్చుగీసువారితో మొదట విరోధముగ నుండినను దర్వాత సౌహార్దమును సంపాదించుకొనెను.

ఆంధ్రుల యదృష్ట మెదురు తిరిగినది. సామ్రాజ్యము నాశనమయ్యెను. కళలను గౌరవించువారెవరు? ఆంధ్ర సంస్కృతిఁ గాపాడఁగల సార్వభౌము లెక్కడ? అంతయు నగమ్యగోచరము. ఇట్టి యుగము నేమనవలయునో తెలియుట లేదు. ఆ నాఁడు చిన్నచిన్న రాజ్యములు పరిపాలించుచుండిన రాజులు చరిత్ర హీనులు. వారిని గుఱించి తడవు

కొనుట మనదే లోపము. ఇంతకు నాంధ్రులు దౌర్భాగ్యులు. అఖిలాంధ్రప్రపంచము మహాయాతనముల ననుభవించు చుండెను. బలవంతునకె యన్ని సౌకర్యములు. బలహీనుడు బ్రతుకలేకుండెను. చంద్రగిరిలో నామకార్థ మాంధ్రరాజ్య మున్నప్పటికి నాంధ్రదేశము చాలవఱకు గోల్కొండ నవాబుల పాలనలో నుండుటచే నాంధ్రు లెట్టి యుపకారముఁ బొందఁజాలనివారలైరి.

---

౧౦

ముంగొండయందును బ్రహ్మాండమైన విప్లవము బయలుదేఱెను. పేరుభట్టిపుడు నిస్సహాయుఁడని ప్రజలు గుఱుతించిరి. అందులకుఁ దోడు బ్రాహ్మణుల మత్సరము. పాళెగాని దౌర్జన్యమునకు మేరలేదు. పట్టు పగ్గములు లేకుండెను. గ్రామస్థులందఱు నొకటైరి. ఒకవంక పేరుభట్టు గృహమునకు బహిష్కారము. మఱియొకవంక పన్నుల నిరాకరణ. పేరుభట్టు కుటుంబజీవిత మడకత్తెఱలోని పోఁక చందమయ్యెను. రక్షించువా రెవరును లేరు. ఈ సంకట పరిస్థితులలో నతఁడు దిగులుపడి కూర్చుండెను. పూలమ్మిన వీథిలోనే కట్టెలు మోయవలసివచ్చుట. ఇది దైవయోగము. తన కిట్టి యవస్థ చేకుఱునని కలనైనఁ దలఁపలేదు. కోడ లింటికివచ్చి సంవత్సరమైనఁ గడువలేదు. వారి ముద్దు తీఱక ముందె యీ యనర్థము.

జగన్నాథుఁ డీ వైపరీత్యమును గుఱించి తీవ్రముగ విచారింపఁ దొడఁగెను. ఇంట భుక్తికి జరుగుటకూడ కష్ట

తరమె. పలుకు మనుష్యుఁడును లేఁడు. ఎంత చదువుకొన్న నేమి ఫలము? మన్నించు దాతలు లేరు. ఒకనాఁడు తండ్రితో మాట్లాడుచు నగ్రహారపరిస్థితులు చక్కదిద్దుటకు మార్గ మేమని ప్రశ్నించెను. అతఁ డందులకు "నేఁ డాంధ్రదేశము గొడ్డుపోయినది. మన కిప్పుడు సహాయము చేయువారెవరు లేరు. శేషాచలప్రాంతమునఁ జంద్రగిరిలో నొక యాంధ్ర సామ్రాజ్య జ్యోతి మిణుకు మిణుకు మనుచున్నది. ఆ జ్యోతియే మనల నీ దారిద్ర్య గాఢాంధకారమునుండి యుద్ధరింపఁగలదు. లేకున్న మనము పస్తు లుండవలసి వచ్చును" అనెను. తన పాండిత్య ప్రకర్షచేత చంద్రగిరిరాజును మెప్పించి, యగ్రహార పరిస్థితులు సరిదిద్దుకోవచ్చు నని యతని యభిమతము.

చంద్రగిరికిఁ బయనమైనాఁడు. తల్లిదండ్రు లాశీర్వ దించిరి. కామేశ్వరి క్రేఁగంటిచూపుల శుభాశంసనముఁ దెలు పుచు భర్తను సాగనంపినది. గృహములోఁ గలిగిన కల్లోల మామె కిప్పు డిప్పుడే యర్థమగుచుండెను. ఏ వస్తువును దీసుకరమ్మన్నను మామగారు దీర్ఘాలోచనలో మునుఁగు చుండిరి. అత్తయ్యకూడ పూర్వమువలె నుత్సాహముగఁ గనిపించుటలేదు. భర్తలో సంభవించిన మార్పుగూడ నధికమె. సంసారపుగుట్టు నామెకు చెప్పకుండిరి. తెలిసికో వలయునని కామేశ్వరియు నుబలాటపడలేదు. భోజనములు పరిమితములగుచున్నవి. అయిన పదార్థములు వెంటనే తెచ్చుటలేదు. ఆ మువ్వురిలోను దైన్యరేఖలు ప్రతిబింబించు చుండెను. ఇది యార్థిక దుస్థితిగా కామేశ్వరి పసిపట్టెను.

చేయున దేమియు లేకఁబోవుటచే మనస్సులోనే క్రుంగి కృశించుచుండెను. పాప మమాయకురాలు!

ప్రయాణభారమునకు సొలసి యెట్లో జగన్నాథుఁడు చంద్రగిరిని చేరుకొనెను. రాజాన్నసత్రములో భుజించి, రాజసందర్శన కౌతూహలియై యాస్థానప్రదేశముఁ జేరుకొనియెను. భటు లడ్డగించిరి. వారికి సవిస్తారముగాఁ దన వృత్తాంత మెఱిఁగించెను. వారు రాజుచే ననుజ్ఞాతులై యతని నాస్థానములోనికిఁ బ్రవేశపెట్టిరి. వెంకటరాయలు సగౌరవపురస్సరముగా నభినందన మాచరించి, యుచితాసనాసీనుఁ గావించెను. అంజలిబద్ధుఁడై "ఈ యువ వయస్సులో మహాపాండిత్యమును సంపాదించినవారివలెఁ దాము గనిపించుచున్నారు. తమ చరిత్రముఁ జెప్పి నా కుత్సాహము గలిగింపుఁ" డని ప్రార్థించెను. అందులకు జగన్నాథుఁడు తన చరిత్రనంతయుఁ జెప్ప వేంకటరాయలు సంతోషించి, దుశ్శాలువల బహూకరించెను. ఆ బహుమానమును స్వీకరించి జగన్నాథుఁడు "రాజా! నా దొక విన్నపము గలదు. సావధానముగా వినుఁడు. మా తాతగారి భరతనాట్యమునకు మెచ్చి మహోదారుఁడు, కళాప్రియుఁడు నైన శ్రీకృష్ణదేవరాయలు మాకు గోదావరీప్రాంతమందలి ముంగొండ యను గ్రామము నగ్రహారముగ నొసఁగినాడు. రెండుతరములుగ ననుభవించుచుంటిమి. ఎప్పు డేమైనఁ బ్రతిబంధకము లేర్పడిన రాజోద్యోగులు వచ్చి తొలఁగించి పోవుచుండిరి. ఇప్పు డా గ్రామములో మాకుఁ గానివా రొక విప్లవమును

లేవనెత్తిరి. పన్ను లిచ్చుటలేదు. అందఱుఁ గలసి కట్టుగ నున్నారు. మాకు విద్య గలదు. జీవనమున కా యగ్రహారముమీఁది యాదాయము తప్ప వేఱొండు లేదు. ఎటులనైన ననుగ్రహించి మీ వంశీకులు దానమిచ్చిన వస్తువును మే మనుభవించునట్లు చేయ ప్రార్థన'' అని విన్నవించెను. సభలోనివారెల్ల జగన్నాథుని దైన్యమునకు వగచిరి.

వేంకటరాయలకు వినుటకుసైతము హృదయవిదారకముగ నుండెను. అయిననేమి చేయఁగలఁడు? ఎంతయో తడ వాలోచించెను. ''పండితోత్తమా! ఏది యసాధ్యమో దానినే కోరితిరి. మీ కోరికనుదీర్ప లేనని చెప్పుట కెంతయో విచారించుచున్నాను. రాజ్యపరిస్థితులు సరిగ లేవు. మీప్రాంత మిచటికి చాలదూరము. ఒకరిద్దఱిని పంపినంత మాత్రమున నేమియుఁ గాదు. కనీస మొక నలువదిమందియైనఁ గావలయునుగదా? నే నంతమందిని శత్రురాజ్యముగుండ నెట్లు పంపఁగలనో తామె యూహించుకొనుఁడు. మే మొసఁగు సన్మానద్రవ్యముతోఁ గాలముఁ గడుపుఁడు.'' అని నూఱు మొహరీల నొసంగెను. జగన్నాథుని నోటినుండి మాట పెకలిరాలేదు. ఆశ నిరాశయయ్యెను. తన జీవితములో నిట్టి విపరీతఫలితము నెన్నఁడు నెదుర్కొనలేదు. ఇదియె మొదటిసారి.

గృహమునకుఁ దిరిగి వచ్చెను. తండ్రికి జరిగిన వృత్తాంతమును వినిపించి, మన యగ్రహారముమీఁది యాశ వదలుకోవలెనని చెప్పెను. జగన్నాథుఁడు సంపాదించుకొని

వచ్చిన మొహరీలను జూచి యెల్లరు సంతోషించిరి. ఇఁక సంపాదించకున్న లాభము లేదనియు, తా నందులకు బయలు దేఱ నున్నాననియుఁ దల్లిదండ్రులకుఁ జెప్పెను. వారుఁ దమ యేకైకపుత్రునికి వచ్చిన దురవస్థకు విలపిల్లిరి. "సంపాదనము పురుషలక్షణము. అడవిఁ గాచిన వెన్నెలవలె పాండిత్యమును వ్యర్థము గావింపనేల ? నాకేమియు భయములేదు. దేశమును దిరిగి ధనమును సంపాదించుక రాఁగలను. ఈ దారిద్ర్యముతో నెంతకాలము క్రుంగవలె" నని వినుగుతోఁ జెప్పెను. ఎవరు నేమియు మాటలాడరైరి. మొహరీలను మార్చి యవసరమైన పదార్థములఁ బేరుభట్టు తెప్పించెను.

జగన్నాథుడు విదేశగమనమునకు సిద్ధపడెను. తల్లిదండ్రుల కెంతమాత్రము నిష్టములేదు. కృతనిశ్చయమును మార్చుకొనఁ జాలనివాఁడయ్యెను. ఇంతకు జీవనమునకు సంపాదనకూడ యవసరమే! కామేశ్వరిలో నాందోళన మధికమాయెను. భర్తను వదలియుండుట దుస్సహము గదా ? వలపుతడి యారని దాంపత్యము. కావలసి వస్త్రములను, గ్రంథములను సేకరించి, తల్లి దండ్రుల పాదాభివందన మాచరించి, వారి యాశీస్సులఁ బడసి, కామేశ్వరికి శీఘ్రమె వచ్చెదనని ధైర్యముఁజెప్పుచు జగన్నాథుఁ డాముంగొండాగ్రహారమును వదలి విదేశగమనార్థము వెడలెను. కనుచూపు మేర వఱకు నతనిఁ జూచుచు పేరుభట్టు దంపతులు, కామేశ్వరి యొక నిట్టూర్పు విడిచిరి.

ప్రథమాధ్యాయము సంపూర్ణము

---

# వీరకంకణము

## ద్వితీయాధ్యాయము

### ౧

కాశ్మీరదేశము భూలోకస్వర్గము. అచటి వనములు నందనోద్యానతుల్యములు. ఇది కవులు, పండితులు, యాత్రికులు చేయు వ్యాఖ్యానము. ఇందతిశయోక్తి లేదు. కాశ్మీరము భరతఖండ సౌందర్యమునకు జీవగఱ్ఱ. ప్రపంచదేశములలో నిట్టి సౌందర్యసీమ వేఱొకటి లేదు. యుగయుగముల నుండి తన ప్రత్యేకతను నిల్పుకొని ప్రపంచ దేశయాత్రికుల నాకర్షించుచుండిన ధన్యదేశము కాశ్మీరము. దివ్య ప్రకృతి సౌందర్యముతోఁబాటు సకల విద్యాసాగరులతో వైజ్ఞానికాభ్యుదయమునంది యలరారినది. వైజ్ఞానిక మహత్వముతోఁబాటు శిల్పకళా ప్రాభవము నోఁచుకొన్నది. శిల్పకళా ప్రాభవముతోఁబాటు పారిశ్రామికాతిశయముతో విజృంభించినది. భారతదేశోత్తరభాగమునఁ గలదు. ఢిల్లీని ముఖ్యపట్టణముగ రాజ్యమేలు రాజులకు నది వేసవికాలపు రాజధాని.

మహోన్నత హిమవన్నగశ్రేణుల మధ్యఁ గాశ్మీర దేశము చూడఁ గనుల పండువుగా నుండును * ఆప్రదేశపు

---

* భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ కాశ్మీరదేశ ప్రకృతి సౌందర్యమును గుఱించి 1940 సం.లో వెలువరించిన భావము లిందు గ్రహింపఁబడినవి.

రామణీయకత చూచువారలపై సమ్మోహనాస్త్రముఁ బ్రయోగించినట్లుండును. ఆపర్వత శిఖరములనుండి స్రవించు హిమ జలప్రవాహములు, సరోవరములు తీర్చి దిద్దిన ట్లుండి, నానావిధ కుసుమ ఫలభరితములైన లతావృక్షపంక్తు లా భూభాగమునకు శృంగారరసము చిందుచుండెను. కాశ్మీర ప్రకృతి సౌందర్య మనుభవైక వేద్యమేకాని, వర్ణించుట కసాధ్యము. గంభీరములై యంబరచుంబితములైన పర్వత శిఖరములు—నికటమైన యగ్గిరి కటకతటములు—వానికి నధః ప్రదేశముల పాతాళలోకమును స్ఫురింపఁజేయు లోయలు—వానిలోఁ బ్రవహించు శైలవాహినులు దృశ్యానుభూతములు మాత్రమే! వీరయోధుని యుద్ధగతివలె నొక క్షణ మానందము—నొక క్షణము భీతియుఁ గొలుపుచుండెను. అచటి ప్రకృతి పరిణామ శీలత్వము చూపఱకు ప్రపంచ వ్యవస్థను ద్యోతకముఁ జేయును.

ప్రకృతికాంత తన యొయ్యారపు నడకల సౌందర్యము నచటనె కేంద్రీకరింపఁ జేసికొన్నది. ప్రకృతికన్య యొక్కొక మాఱు చిఱునగవు లొలుకుచున్నట్లు—నొక్కొకతఱి చింతాభారాక్రాంతమైనట్లు గన్పట్టును. దాల్ సరస్సునుండి లేచు పొగమంచుపొరలు ప్రకృతి కన్యాముఖబింబముపై నాచ్ఛాదితమైన మేలిముసుంగువలె భాసిల్లును. కాదంబినీ కాంత యొక్కొకతఱి పర్వతాగ్రములఁ గౌఁగిలించుకొనును. మఱియొక్కకమాఱు దోబూచులాడు నర్భకునివలె చాటు మాటుగ నా కొండలోయలలోనికి దిగజాఱుచుండును. ఆ

శోభావిలాస మా సుందరారామ సీమలలోఁ జూచువారికి రసాస్వాదముఁ గూర్చునఁట! ఆ దృశ్యములు స్వాప్నిక జగతిలో మానవునకుఁ గలుగు ననుభూతివలె నుండును. మానవ జీవితములో నావిర్భవించు దుస్సాధ్య. మనంతములైన వాంఛా విశేషములవలెనే ప్రకృతి లీలలు గోచరించెడివి. స్వప్నములో సాక్షాత్కరించు ప్రియురాలి సుందర ముఖార విందము శృంగారరసము మేనఁ జిలుకరించి, జాగృతిఁబొందినంతనే యదృశ్యమైనట్లు నచటి ప్రాకృతికశోభలు వెలారు చుండును.

కాశ్మీరపు లావణ్యము, ప్రకృతి సౌందర్యము తనివి దీఱఁ గ్రోలి యానంద వివశుఁడుగానివాఁ డుండఁడు. దానికి ముఖ్యపట్టణము శ్రీనగరము. రెండు ప్రధాన విభాగము లతోఁ గాశ్మీర మొప్పుచున్నది. ఒకప్రాంతము శ్రీనగరము. మఱొక ప్రాంతము జమ్మూ. శ్రీనగరమునుండి జమ్మూకు పోవునప్పుడు సుప్రసిద్ధమైన 'కాశ్మీరలోయ' గుండా ప్రయాణముఁ జేయవలసివచ్చును. అది చాల లోతైన లోయ. యాత్రికు లా లోయ నధిగమించి, మెత్తుమీఁదికిఁ బోను బోను చక్కా రమణీయములైన మనోహర దృశ్యము లనేకము గనిపించును. ఆమెత్తుపైనుండి యొక సొరంగముఁ బ్రవేశింతురు. అచటనుండి పాతాళలోకమువలెఁ గనుపట్టు కాశ్మీరలోయఁ గాంచిన, ననిర్వాచ్యము, ననుపమములై, మహాలావణ్యము నోఁచుకొని చారణగానముచేఁ జరిత్రప్రసిద్ధమైన 'కాశ్మీరలోయ' నేత్రపర్వముగ నుండును. ఆ హిమ

చ్ఛన్నగిరి శృంగములపైఁబడు సాయం ప్రస్ఫుట రాగరంజిత సూర్య స్వర్ణకాంతులు నలుగడలఁ బ్రసరితములై మహానంద సంధాయకములుగా నుండును. ఆలోయలోనుంచి సెలయేళ్ళ ధ్వని దూరమున నున్నవారికి మంద మధుర సంగీతమువోలె శ్రవణానంద సంధాయకము.

కాశ్మీరము భారతదేశమునకే కాక ప్రాక్ప్రాభాగమున కంతటికిఁ గ్రీడారంగము కాఁగలిగిన సౌందర్యసీమ. విదేశయాత్రికుల కియ్యది కొన్నిశతాబ్దములనుండి వినోద విహారప్రాంతము. కాళిదాసాది మహాకవుల భావనా జగత్తులోఁ దన యసమాన రామణీయకతచే స్థాన మేర్పఱచుకొన్నది. బౌద్ధభిక్షువుల కొకప్పుడు యాత్రాస్థలము. భారత దేశములో నార్యప్రవేశమునకు సుస్వాగత మిచ్చిన పుణ్యభూమి. జలప్రవాహములచేఁ బరిసరప్రాంతము నంతయు సస్యశ్యామలముగఁ జేయఁగలిగిన సారవంత భూభాగము.

అచటి ప్రకృతిశోభ కెంతటి మహత్తు గలదో, కళలకు నంతియె కలదు. కాశ్మీరశాల్వాలు ప్రపంచములో సుప్రసిద్ధములు. తమ కళావైదగ్ధ్యముతోఁ దీఁగెలు, పూలు, చెట్లుఁ బట్టుశాల్వాలపై జరితో నగిషీపనిచేసి కాశ్మీరీయులు ప్రపంచ దేశములకుఁ బంపుచుండిరి. భారతదేశపు సరిహద్దులలోఁ గల దేశములందు కాశ్మీరవస్తువు లెక్కుడు ప్రచారమందెను. మొగల్ నవాబులు కాశ్మీరశిల్పము నెక్కువగఁ బ్రేమించువారు. వారి వేషాదికములకు, వారి రాణుల వస్త్రములకు కాశ్మీరమునుండి నిపుణుల రావించి, జరితో నగిషీలు

చేయించుకొనెడివారు. ఈ విధముగ వారికళ రాజాదరణ పాత్రమయ్యెను.

కాశ్మీరదేశము లతానికుంజములతోడను, సెలయేళ్లతోడను, తీర్చిదిద్దినట్లుండు వృక్షరాజములతోడ నొక యుద్యానవనమువలెఁ గన్పట్టును. ద్రాక్షాలతలు విశేషము. రుచికరమైన సీమరేఁగు పంట కది పెట్టినది పేరు. భారతదేశమున కుంకుమపూవు విపరీతము లభించు ప్రదేశ మదియె. వరి, గోధుమ, శ్రీగంధపుచెట్లు ముఖ్యమైన పంటలు. కాశ్మీరాంగనలలోని ముగ్ధమోహనలావణ్యము వర్ణనాతీతము. అచటి ప్రజల నాగరికత స్వభావసిద్ధ మనవచ్చును— కృత్రిమము మాత్రము గాదు. భారతదేశములోఁ గలుగు రాజకీయపరిణామము లెట్లున్నను వారిలో మార్పులేదు. విక్రమాదిత్యుని కాలములో వారి పరిస్థితి యెట్లున్నదో యక్కరువఱకు నంతె. హిందు - మహమ్మదీయులు మతములఁ బట్టి విడిపోక నిర్వురుఁ గలసి మెలసి యుండిరి. కొంతకాల మొకరితో నొకరు బాంధవ్యములు నెఱపుకొనుచుండినట్లును జరిత్ర సాక్ష్య మిచ్చుచున్నది. సంస్కృత మహాపండితులకుఁ గాశ్మీరదేశము కాణాచి. అచటి బ్రాహ్మణులు విద్యాసాగరులు.

శ్రీనగరము ముందు జీలమునది కలదు. వేసవికాలములోఁ గొందఱు తెప్పలలోనె సంసారములు పెట్టకొని జీలమునదిలో నుండెడివారు. కేవలము మంచుకరగిన నీటితోనే జీలమునది ప్రవహించును. వేసవికాలములో మాత్రము

పంజాబ్ దేశము మీఁదుగఁ గాశ్మీరమునకుఁ బ్రజలు నడచి పోవుచుండిరి. వర్షాకాలమున మార్గమంతయు హిమముచేఁ బంకిలమై యుండును. ఒంటెలు, గుఱ్ఱములపై మాత్రమె ప్రయాణము చేయుచుండెడివారు. కావున భారతదేశవాసులతోఁ గాశ్మీరీయుల కెక్కువ రాకపోకలు లేకుండెను. తన కళా, వైజ్ఞానికాతిశయముచే భారతదేశములోఁ దన పలుకుఁబడిని వ్యాపింపఁ జేసికొన్నది. కవులు తమ భావనా జగత్తునకు మెఱుఁగుఁ బెట్టుకొనుటకుఁ గాశ్మీరమును దర్శించుచుండిరి. ఇది యా దేశపు స్థితి.

జహంగీరు శృంగారలోలుఁడు. కళాభిమాని. ఆతని యభిమానపాత్రము కాశ్మీరము. మొగలుసామ్రాజ్య మాసేతు శీతనగపర్యంతము వ్యాపింపఁ జేయవలెనని అక్బరు చక్రవర్తి యాశయము. తన రాజ్యములోఁ బ్రజ్వరిల్లు విప్లవము లడంచుకొనవలెను. పరరాజ్యాక్రమణమునకుఁ గృషి చేయవలెను. ఈపరిస్థితిచే జహంగీరు సతతము యుద్ధములలో నిమగ్నుఁడై యుండెడివాఁడు. విశ్రాంతి దొరకినపుడు మాత్రము కాశ్మీరమునకు వచ్చి సుఖముగఁ గాలము గడుపుచుండెను.

జహంగీరు త్రాగుబోతు. కాశ్మీరములోని ద్రాక్షాసవమన్న నతనికి కడుంగడు ప్రీతి. అందుచే సపరివారముగఁ గాశ్మీరయాత్ర తఱుచు చేయుచుండెను. మధుపానమత్తుఁడై నప్పుడు కళాప్రియత్వమతని వెన్నంటును. దానంజేసి కవులను, గాయకులను, పారశీకపు సౌందర్యవతులైన నర్తకు

రాంద్రను వెంటఁబెట్టుకొని వచ్చువాఁడు. ఆ నవకవితారస వాహినులలో, నా వీణా క్వణన్నిర్గత రాగమాలికలలో, శృంగారలీలా నటనానుభూత భావనాజాలములో మహానంద మనుభవించుచుండెను.

శ్రీనగరములోఁ దన నివాసమునకై ప్రత్యేకముగ నొక మహామందిరమును జహంగీరు నిర్మించుకొన్నాఁడు. అందు వివిధలతా నికుంజములు, వృక్షములు గలవు. ఉదయ భాను కిరణముల విచ్చిపోవుచుండు పొగమంచుల నా యుద్యానములోఁ గాంచి జహంగీరు ప్రకృతి విశేషములకుఁ దనలోఁ దానె యాశ్చర్యపడుచుండెను. మహాపండితులచే సంస్కృతము నేర్చువాఁడు. సంస్కృతము రానిదె భారత వాఙ్మయములోని గొప్పతన మెఱుంగఁ జాలనని గుర్తించి నాఁడా జహంగీరు. ఇప్పుడు సంస్కృతమాతని యభిమాన భాష. కాశ్మీరములో జహంగీరు నిత్యకృత్యము విద్యా వ్యాసంగము, కళాపోషణ, ద్రాక్షాసవపానము. అతనిలోఁ జింతారేఖ లన నెట్టులుండెడివో కాంచిన వారెవరును లేరు.

---

## ౨

విద్యా-విత్త సంపాదనలకు మేర లేదు. ఎంతచదివినను జదువవలసియే యుండును. అటులనె విత్తముగూడ. కోట్లకు పడగలెత్తినను సంపాదించుట మానుకొందురా? ఇట్టి వ్యవస్థయే సంఘముయొక్క యొడిదుడుకులకుఁ గారణమని చెప్ప వచ్చు. మానవుఁ డాశాబద్ధుఁడు గాకున్న ప్రపంచ తత్త్వమె

5

వేఱుగనుండెడిదేమో? అభ్యుదయవాంఛయె మానవునివిచిత్ర గతుల నాడించుచుండును. అది మాయ యనుఁడు. సృష్టివైప రీత్య మనుఁడు. ఇట్టి మహత్తరప్రభావము సృష్టిలో నిమిడించిన దేవునకు నమోవాకములు. ప్రతివారుఁ దెలిసికొనియుఁ దప్పటడుగులు వేయుచుండిరన్న నింక నెట్లు వ్యాఖ్యానించఁ గలము? ఈ విచిత్ర పరిణామముల కంతటికి మానవునిలోఁ బ్రజ్వరిల్లు నాశాజ్యోతియె కారణము. అట్టి యాశాజ్యోతియె జగన్నాథుని దేశాంతరగతుఁ జేసినది. కష్టసుఖములకుఁ గాఁక తేఱునట్లు గావించినది. అగ్నితప్తమైనఁ గాని బంగారము కల్మషరహితమై, పరిశుద్ధ మెట్లుగాదో, యటులనే మానవ జీవితము కష్టపరంపరాయుక్త మైనఁగాని శోభింపదు.

జగన్నాథుఁడు గోదావరీ ప్రాంతమును దాఁటినాడు. బరువెక్కిన హృదయముతో గంతవ్యస్థానము లేకయె ప్రయాణము సాగించుచుండెను. దినమున కొక గ్రామము. అప్పుడప్పుడు నుపవాసములు. శరీరము బలవంతముగ ముందుకుఁ బోవుచున్నను, కామేశ్వరీ ప్రేమపాశ మాతనిహృదయమును వెనుకకు లాగుచుండెను. పతాకధ్వజము ముందునకుఁ బోవుచున్నను గాలిచే నాచీనాంశుకము వెనుకకుఁ బోవునట్లున్నది. తల్లి దండ్రులఁ దలఁచుకొన్న పుట్టెడు దుఃఖముతోఁ గ్రుంగువాఁడు. తన మహాప్రస్థానమునకుఁ దుది యంతు పట్టుటలేదు. పిచ్చివానివలె నతఁ డంతరంగములో నేమేమో యూహించుకొనుచుఁ బ్రయాణము సాగించుచుండెను. ఒక పక్షము నడచి గోల్కొండ సమీపించెను.

అచటఁ బండిత సత్కారము జరుగునేమోనని ప్రయత్నించి చూచినాడు. తన పథకము కుదురలేదు. నాఁటి గోల్కొండ నవాబు కవి, పండితుల సన్మానించుట నాచారముగఁ బెట్టుకొనలేదు. గత్యంతరము లేక నచటినుండి మఱలఁ బ్రయాణమయ్యెను.

ఒక మాసము నడచి మహారాష్ట్రముఁ జేరెను. అచట రెండు మూఁడు చిన్న సంస్థానములు పండితపోషణ గావించెడివి. ఆయా స్థానములకు వెళ్ళి తన పాండితీ ప్రకర్షఁ జూపినాడు. గంగాప్రవాహమువలె స్వచ్ఛమై, సముద్రమువలె గంభీరమై, ద్రాక్షారసమువలె మధురమైన జగన్నాథుని వాదనాతిశయమునకు వారచ్చెరువొందిరి. ఆ రాజులు చేసిన సన్మాన మందుకొనెను. మహారాష్ట్రుల యాచారము, వారి వేషభాషాదు లతనికి నచ్చినవి. ఆ స్త్రీలలోఁ గనిపించు బిగి, రూపలావణ్యము క్రొత్త చవులూరించెను. కొన్నిమాసము లచటనె యుండి మహారాష్ట్రభాషను నేర్చెను. వారి నాగరికత నభిమానించినాడు. వారును జగన్నాథుని రూపసంపదకు నాశ్చర్యచకితులై యతనిఁ జాల మర్యాదగఁ జూచుచుండిరి. ఆ రసికత్వములోఁ బడి తల్లిదండ్రులను, గ్రామమును మఱచెను. ప్రేమపాత్రమైన ప్రియురాలి విషయముఁ గూడ నతనికిఁ దట్టుట లేదు.

గుజరాతు నంతయుఁ గ్రుమ్మరెను. భగ్నావశిష్టములై తన పురాశోభలఁ బ్రతిబింబించుచున్న సోమనాథేశ్వరాలయముఁగాంచి బాష్పముల రాల్చినాడు. అచటి సాంప్ర

దాయములు, స్త్రీల వేషాదికము లతని మనస్సున హత్తు కొన్నవి. తఱువాత నిప్పులు చెఱగు బుందేలుఖండవాసుల ప్రతాప ప్రజ్వలనముఁ గాంచి వీరావేశుఁ డయ్యెను. గుజరాతు సారస్వతములోని మాధుర్యముఁ జవిచూచినాడు. భాషలు సాధ్యమైనన్ని నేర్వవలయునని పట్టుదల. ఆర్యభాషాకుటుంబ మునకుఁ జెందిన భాషలకు సంస్కృతముతో సంబంధ మెక్కువ. అందుచే జగన్నాథున కే నూత్నభాషయైనను గొన్ని నెలలలో సాధించుటకు వీలు. తన పర్యటనముఁ గేవలము ధనసంపాదనకు మాత్రమె గాక, విజ్ఞానసంపాద నార్థముగను భావించెడివాఁడు. అందువలన నే దేశ మేగిన నచటి భాష, సారస్వతముఁ దెలిసికొనవలయునని యుబ లాట. ఈ పద్ధతిచే నతని పాండిత్యము, కవితాలోకము సువిశాలముగుచుండెను. అన్ని భాషా, సారస్వత సాంప్ర దాయము లతనిలో జీర్ణించినవి.

త్రివేణీ సంగమము గమ్యస్థానము. విపరీత ప్రయాణ శ్రమముతో నా పుణ్యస్థలముఁ జేరుకొన్నాడు. సత్వ రజ స్తమో గుణము లైక్యమైన ట్లచట గంగా, సరస్వతీ, యమున లైక్యమైనవి. వానితోఁబాటు సంస్కృతము, ప్రాకృతము, ప్రాకృతాభాసములకు నదియె సంగమ ప్రదే శము. ఆ రోజులలో నదియు నొక విద్యాకేంద్రముగఁ బేరు వడినది. అచటి విద్వాంసులను దర్శించినాడు. తన సకల శాస్త్రవిజ్ఞానముచేఁ బండిత పరిషదమువారి మెప్పునొందెను. స్థలప్రభావమో, జలపాన విశేషమేమోగాని త్రివేణీ సంగమ

ములోఁ జదువు విద్యార్థులకు సులభముగ విద్య వచ్చుచుండె డిది. వందల సంవత్సరములనుండి జరుగు కుంభమేళముఁ దిలకించినాడు. అప్పుడు జరిగిన యఖిలభారత విద్వత్పరిష త్తులోఁ దన ప్రతిభా విశేషముఁ బ్రదర్శించి యొక్క మాఱు భారత ప్రఖ్యాతిని సముపార్జించెను. దేశములోని నలు మూలలఁగల పండితులతోఁ బరిచయము. కాశీ మహారాజు జగన్నాథునకుఁ గాశ్మీరశాల్వ నొకటి బహూకరించెను.

సత్యహరిశ్చంద్రుని గతిసపరీక్షకుఁ గురిచేసినచోటు. వ్యాసుని భిక్షాపాత్రను నిర్దాక్షిణ్యముగా నింపకఁ గోపకార ణమై శాపఫల మనుభవించిన పట్టణము. బుద్ధుని మహా నిర్వాణముతోఁ బ్రపంచప్రసిద్ధమైన పవిత్రప్రదేశము. వీర శైవసాంప్రదాయముల నున్నతివహించిన మహానగరము. శంకరాద్వైతవాదపరంపరవ్యాప్తికిఁ గేంద్రము. భాగీరథీ పవిత్ర ప్రవాహావృతము. నిరతఘంటారావ సకలదురితక్షయ స్థానము. చతుర్వేదమంత్రఘోషావిర్భూత బ్రహ్మవిద్యా నిలయము. సకలమానవముక్తిమార్గైకసాధనము. మహా విద్వాంస సంసేవితము. విశ్వనాథ పాదకమలశోభితము. అన్నపూర్ణా వరప్రసాదిత నానైశ్వర్య సంయుక్తము. విశ్వ కళాపరిషన్మండితము నయిన కాశిఁ జేరుకొనియెను. జన్మము తరించినట్లుగా జగన్నాథుఁడు భావించెను.

కాశీపట్టణములోఁ బ్రవేశించుటతోడనే జగన్నాథున కమితోత్సాహము గలిగినది. విద్యాలయముఁ బ్రవేశించెను.

అధ్యాపకబృందముతోఁ గృతసత్కారుఁడై కొంతకాల మచట గౌరవాతిథిగా నుండెను. తండ్రికి గురువు. వ్యాకరణ మునఁ బ్రామాణికుఁడు నయినట్టి శేషవీరేశ్వరునితోఁ దన యధ్యయన జిగీష వెలుపరించెను. శేషవీరేశ్వరుఁడును స్వపాండిత్యమును నూఁటిపోయఁ దగిన ఛాత్రసత్తముఁడు లభిం చెనని పరమానందభరితుఁ డయ్యెను. వ్యాకరణము సమగ్ర ముగఁ బాఠముఁ జెప్పెను. శబ్దశాస్త్రమును తూర్ణముగ బోధించినాడు. న్యాయ, వైశేషిక, మీమాంసా, సాహి త్యాదులం దకళంక ప్రతిభాసంపన్నుఁడై జగన్నాథుఁడు కాశిలోఁ గొంతకాలము గడపెను. అరబ్బీ, పారశీకభాష లను నేర్చినాడు. అష్టభాషాప్రవీణుఁ డను బ్రఖ్యాతిని సము పార్జించి కాశిని వదలి దేశయాత్రకు మఱల బయలుదేఱెను.

మొగల్ చక్రవర్తులు సాహిత్యలంపటులు, కళా పోషకులనియు జగన్నాథునకుఁ దెలియవచ్చినది. అటనటఁ దిరుగుచుఁ బ్రాచీన భారత విజ్ఞానఖని యని పేరువడిన నలందా విశ్వవిద్యాలయము దర్శించినాడు. భట్టోజీ యితని కంటఁబడెను. జగన్నాథుని మేనుపైఁ గల కాశ్మీరశాలువను జూచుటతోడనే భట్టోజీ కనులు గుట్టినవి. వాదప్రతివాద ముల జగన్నాథు నవమానపఱచఁ బ్రయత్నించెను. జగ న్నాథుఁడు సామాన్యమాత్రుఁడా ? భట్టోజీ పుట్టు పూర్వో త్తరములఁ దెలిసికొనెను. శేషావతారమని మహాప్రఖ్యా తుఁడై కాశీ వ్యాకరణాచార్యపీఠమెక్కిన యాంధ్రుఁ డగు శ్రీకృష్ణపండితునియొద్ద విద్య నభ్యసించె ననియు, నతని

ఖండన మండనాదుల నెదుర్కొన్న గురుద్రోహి యనియు నెంచెను. దానితో జగన్నాథుని రొమ్మలు మండినవి. వాదప్రతివాదములకుఁ బూనుకొన్నాడు. బ్రహ్మాండమైన పండితపరిషత్తు సమక్షములో ప్రచండపాండితీచర్చ. తుదకు భట్టోజీ లొంగిపోయెను. జగన్నాథుని క్షమాపణ వేఁడు కొన్నాడు. దానితో నతని కీర్తి యుత్తరహిందూస్థానమం దంతట వ్యాపించెను.

ఒకనాఁడు కనుగూర్కినంతనే మధురముగ్ధమైన తన ప్రియురాలి ముఖారవిందము, నా లవలీకపోలములపైఁ గాఱు బాష్పబిందువులు ప్రత్యక్షము. వెంటనే మేల్కొనియెను. ఒకవైపు పాండిత్య దిగ్విజయోత్సాహము. వేఱొకవైపు నాత్మీయుల దీనస్థితి. ఈ రెంట జగన్నాథుని మనస్సు చీకాకుపడెను. తుదకు నిగ్రహముఁ దెచ్చుకొన్నాడు. మఱలఁ బయనము. యమునాతరంగోచ్ఛ్రిత బిందు సిక్త శీతల ప్రత్యూష పవనాంకురములు జగన్నాథునకు మేనుపులకరింపఁ జేసినవి. మొగలు సామ్రాజ్య గర్వరేఖ లా రాజప్రాసాద ములలో దృగ్గోచరమగుచుండెను. ఫతేహా సిక్రీ సింహద్వార మందలి శిల్పకళావైభవము మొగలు చక్రవర్తుల కళాప్రియ త్వముఁ జెప్పకయె చెప్పుచుండెను. వీథులు సువిశాలములు. పట్టణమందలి గృహముల నిర్మాణము హిందూ - మహమ్మ దీయ సాంప్రదాయైక్యతను నోఁచుకొన్నది. పట్టణము ప్రశాంత వాతావరణముతోఁ గూడియుండెను. యాతా యాతజను లా జగన్నాథు నాపాదచూడముఁ బరీక్షించు

చుండిరి. కాశ్మీరశాలువయె యాతని మహాపండితుఁ డని యెల్లరకుఁ బరిచయము చేయుచుండెను. యాత్రికుల సౌకర్యార్థము నిర్మింపఁబడి, వివిధగతుల నివాసయోగ్యమైన సత్రముఁ బ్రవేశించెను. అచటి రాజకీయోద్యోగు లుచిత రీతిని గౌరవించిరి.

---

## 3

అక్బరు భారతదేశము నంతయుఁ దన యేలుబడి లోనికిఁ దీసుకరావలెనని ప్రయత్నించెను. ఉత్తరహిందూస్థానమంతయు స్వాధీనముఁ జేసికొన్నాడు. కన్యాకుమారి వఱకు నాక్రమింపఁ బ్రారంభించెను. దక్కనులోఁ గొంత భాగము మాత్రము స్వాధీనమైనది. రాజపుత్రుల ప్రతాపాగ్నిజ్వాలలు మొగలు సామ్రాజ్యమునకు నలుమూలలఁ గ్రమ్ముకొన్నవి. వాని నిరోధముతోడనె కాలము గడచెను. వివిధ నూతన సంస్కరణలఁ బ్రవేశపెట్టి తన పరిపాలనా సామర్థ్యముఁ బ్రదర్శించెను. సామ్రాజ్యమును లాహోర్, కాబూల్, ముల్తాన్, ఢిల్లీ, అజ్మీర్, అహమ్మదాబాద్, మాల్వా, ఆగ్రా, ఔధ్, అలహాబాద్, బీహార్, బెంగాలు రాష్ట్రములుగా విభజించి పాలించినాడు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ సంబంధబాంధవ్యములలో గొప్ప రాజకీయతత్వజ్ఞత నిండుకొనియుండెను. ఏది యెట్లున్న నక్బరు హిందూదేశ చక్రవర్తి బిరుదాంకితుఁడు. సమర్థులు, రాజ్యాంగనిపుణులు నైన మంత్రులు, సేనానులు సహాయముకాఁగా విదేశీయులు

సైతము నివ్వెఱపోవునట్లు రాజ్యమేలెను. ఆసియా మధ్య ప్రదేశములో మొగల్ సామ్రాజ్యభానుఁడు దివ్యప్రకాశ మానుఁడై యుండె నని చరిత్ర తెల్పుచున్నది.

అక్బరుకాలమున నుత్తరభారతమందు నేఁడు కోట్ల జనులు, దక్షిణభారతమున నెనిమిదికోట్ల జనులు నుండిరి. ఇందులో హిందు—మహమ్మదీయ మతముల వారుఁ గలరు. అక్బరు సర్వమతముల గౌరవించినాడు. క్రీస్తు మతముగూడ నాయన యభిమానపాత్ర మయ్యెను. కళలను బోషించెను. సారస్వతము నభివృద్ధిపఱచినాడు. అక్బరు భోగలాలసుఁడు. ఆ భోగలాలసత్వమే మొగల్ సామ్రాజ్యైశ్వర్యము నెంతో కుంటువడఁ జేసెను. ఇందులకు తార్కాణముగా నెచ్చటనున్నప్పటికిని అక్బరు గంగాజలమునె యుపయోగించెడివాఁడఁట! ప్రతిదినము పర్వతములనుండి మంచుగడ్డ తెప్పింపఁబడుచుండెను. ఫలములు కాశ్మీరము, కాబూల్ మొదలగు ప్రాంతములనుండి గొనిరాఁబడెడివి. వేషాభరణాదులకు, నాడంబరములకు ధన మధికముగా వ్యయింపఁబడుచుండెను. నాఁటి దర్బారు జీవితము విలాస భూయిష్ఠము.

ఱాలు కరగించు విమల గాంధర్వవిద్యా పారీణుఁడు, మోడువారిన తరులతాదుల చిగిరింపఁజేయు సంగీత మాంత్రికుఁడు నని సుప్రసిద్ధి వహించిన తాన్‌సేన్ అక్బరు చేత సత్కృతుఁడు. సంస్కృతము, హిందీ, పారశీ భాష లున్నతి వహించినవి. భారతసంస్కృతిని సహస్రముఖములఁ

జాటు రామాయణ, మహాభారతములు పారశీ భాషలో ననువదింపఁబడెను. చక్రవర్తికి ప్రాణ మిత్రము, వేదాంతి, కవియు నయిన అబుల్ ఫజుల్ అక్బరు తర్వాతఁ బేర్కొనఁ దగు వ్యక్తి. మొగలు చక్రవర్తులలో నొక్క అక్బరే భారత నాగరికతను బెంపొందించిన మహామనుడఁడు. మూఢ మత విశ్వాసము లతని దరిఁ జేరరాలేదు. అన్ని మతగ్రంథములను, సర్వమతప్రచారకులను నిష్పాక్షికముగనె గౌరవించెను. ఆనాఁడు తన పుస్తకభాండారములోఁ గల లిఖితగ్రంథముల సంఖ్య యిరువదినాలుగువేలు. † అక్బరు ముద్రణాసౌకర్యము దేశమం దున్నప్పటికి నందుల కేలనో ప్రయత్నింపలేదు.

అక్బరు (1562 సం.) ముస్లిం భక్తుని గోరీని దర్శించుటకై అజ్మీరు వెళ్లెను. అంబర్ రాజ (రాజపుటానా, జయపూర్) కుటుంబమునకుఁ జెందిన బీహారిమల్లు పుత్రికను వివాహమాడెను. ఆమె ముస్లిం నామధేయము మార్యం జమాని (జహంగీరు తల్లి). లాహోరునుండి ఆగ్రా సమీపమునఁ గల ఫతేపూసిక్రీకి 1598 సం. లో సామ్రాజ్యపీఠము మార్చెను.

క్రీ. శ. 1569 సం. లో అక్బరునకు సలీం జన్మించెను. విద్యాసముపార్జన మాతని బుద్ధికుశలత నభివృద్ధిఁ గావించెను. పారశీ, హిందీభాషలను నేర్చినాడు. చారిత్రక, భౌగోళిక,

† వాని విలువ రు. 6,463,731. క్రీ. శ. 1550 సం. ముననె గోవా క్రైస్తవ ప్రచారకులవలన భారతదేశములో ముద్రణాయంత్రము లేర్పఱుపఁబడియుండెను.

ప్రాకృతిక విజ్ఞాన, కళలం దభిమానము మెండు. క్రమశః వేఁట, ఖడ్గపాండిత్యము లాతని యభిమానపాత్రములయ్యెను. నూనూగుమీసాల నూత్నయౌవనమందె మద్యపానమున కలవాటుపడెను. మాన్‌బాయితో వివాహము. ఖుస్రూ జనించెను. మఱొకభార్యయయిన జగతీగోసైన్‌వల్ల ఖుర్రం (షాజహాన్) మొగల్ సామ్రాజ్యాబ్ధికిఁ జంద్రుఁడై పుట్టెను. జహాంగీరు తుద కిరువదిమంది భార్యలను వివాహమాడినాడు. సౌందర్యప్రియుఁడు. నిరంతర ద్రాక్షాసవపానము, ఆతని కనులలో శృంగార దేవత తాండవమాడుచుండును. శరీర ములోఁ బ్రతాపరేఖలు ప్రతిబింబించెడివి. మనసు కళా మయము. ఆలోచనలు సామ్రాజ్యాధికారవాంఛా ప్రస్ఫురి తములు. ఎంత యుత్సాహియో యంతటి యుద్రిక్తుఁడు. ఎంత యుద్రిక్తుఁడో యంతటి సాహసి.

సలీం కోరిక లీరిక లెత్తినవి. రాజ్యాధికారమున కుబ్బూఁతలూఁగుచుండెను. తండ్రి సహజమరణముఁ బొందఁ డని నిశ్చయించుకొన్నాడు. సహనము జాఱినది. తిరుగు బాటు చేయక తప్పినది కాదు. 1601 సం. లో అలహా బాదునకు వెళ్లి పాదుషా బిరుదమును దనకుఁ దానె ప్రక టించుకొనెను. అక్బరు ప్రియమిత్రుఁడైనట్టి అబుల్ ఫజుల్ చేఁ దనకు లొంగిపొమ్మని చెప్పి పుత్తెంచెను. అందులకు సలీం యియ్యకొనలేదు. అబుల్ ఫజుల్ మార్గమధ్యములో వధింపఁబడెను. అందులకుఁ దనప్రేరేపణ కలదని సలీం తుదకు దోషము నంగీకరించినాడు. అక్బరున కియ్యది యశనిపాతము.

పుత్రుని యత్యాచార మాయన హృదయమును దహించి నది. కడపటికి అక్బరు జీవనపాత్ర విషాదరసభరితమయ్యెను. కుమారునకుఁ—దన కధికప్రేమపాత్రుఁడైన మనుమడు ఖుస్రూ మధ్య సింహాసనమునకై సాయుధ సంఘర్షణ తప్ప దనుకొన్నాడు. తనకు వ్యతిరేకమైన కుమారునకు సింహాసన మప్పఁజెప్పుట అక్బరున కిష్టములేదు. సలీం కుమారుఁడు, సత్ప్రవర్తనుఁడునైన ఖుస్రూను పట్టాభిషిక్తుఁ గావింప ప్రయత్నము. అక్బరు సాధ్యమైనన్ని రీతులఁ బుత్రుని లోఁబఱచుకొనఁ బ్రయత్నించెను. ఒకమాఱు సలీం ఆగ్రా సమీపములోఁ దండ్రిని సమాధానమునకై కలిసికొనుట కొప్పుకొనెను. తండ్రికి నమస్కరించునపుడు సలీం బంధింపఁ బడి దేహ మలయునట్లు కొట్టఁబడెను. కొంతకాలమునకుఁ గోలుకొన్న పిమ్మట తండ్రికి దాసోహ మన్నాడు. సలీం తిరుగుబాటు ఫలరహితమైనది. అక్బరునకు మరణకాల మాసన్నమయ్యెను అతిసారవ్యాధి. కష్టముతో నాల్గు వారములు గడపి యిహలోకయాత్రను జాలించెను. తుది ఘడియలలో సలీమును రాజపదవి కంగీకరించినాడు. మొగలు సామ్రాజ్య చరిత్రలో ఒక ఘట్టము ముగిసినది.

ఖుస్రూ రాజ్యాధికారమునకుఁ బ్రయత్నించెను. రాజా మానసింగ్ తోడ్పాటుతో పోరాడినాడు. తిరుగుబాటు విఫలమయ్యెను. నూరుద్దీన్ మహమ్మద్ జహాంగీర్ అను పేరుతో సలీం సింహాసనమెక్కినాడు. ఉద్రిక్తులైయున్న ప్రజానీకమునకు ఇస్లాము మతమును రక్షింతును, ఖుస్రూను

క్షమింతునని జహంగీరు ప్రకటించెను. ప్రజలు శాంతులైరి. అబుల్ ఫజల్‌ను జంపిన రాజపుత్రుఁ డగు భీమసింగ్‌కు గొప్పయుద్యోగమిచ్చుట ప్రజ కసంతృప్తిని గలిగించెను. ఎన్ని యొడిదుడుకు లున్నప్పటికిని సామ్రాజ్యమునంతయుఁ దన పిడికిటిలోనికిఁ దెచ్చుకొని రాజ్యమేలుచున్నాఁడు జహంగీరు.

ఖుస్రూ ఉద్యమమును త్యజింపలేదు. అనుమానముతో జహంగీ రాతనిపై కఠోరనియమముల నమలుపఱచెను. స్వేచ్ఛగ తిరుగనీయలేదు. ఆగ్రా కోటలో బంధింపఁబడి నాఁడు. తనకున్న ప్రజాదరణము గుఱుతించి ఖుస్రూ కోట నుండి తప్పించుకొని పాఱిపోయెను. పంజాబును స్వాధీనము చేసికొని, యుద్ధమునకై వచ్చిన తండ్రిని లాహోరులోఁ దిరుగఁ గొట్టెను. చంపుటకు సైతము ప్రయత్నించినాఁడు. కాబూల్ మొదలగు చిన్నచిన్న దేశముల నాక్రమించు కొనుచు, ప్రజాభిమానము తనకే కలదను గర్వముతో విజృంభించుచుండెను. కడకు తండ్రిచే బంధితుఁడై ఖుర్రం పర్యవేక్షణక్రింద నుండవలసివచ్చినప్పు డతనిచేతనే నిహతుఁ డయ్యెను. ఖుస్రూ పట్టుదల మాత్రము ప్రశంసార్హము.

జహంగీరు కనులలో నరుణరాగము ప్రస్ఫురితము. హస్తములో స్వర్ణచషకము. అందచందము లుట్టిపడు సౌధో పరిభాగములోఁ బ్రత్యంగచలన్నాట్యమాధురులఁ గులుకు నవయావనోన్మత్త కాంతామణుల సేవ. ప్రతిక్షణము జహంగీరున కానందసామ్రాజ్యపు మెట్టువలె నుండెను. మాలతీసుమమునకు సుగంధము తోడైనటుల నా సౌందర్యా

కృతికి రాజకీవి. ఆతని పెదవులు స్మితకన్యావిహారరంగములు. వక్షస్థలము వీరలక్ష్మీ నివాసస్థానము. భుజములు ప్రతాపాతిశయద్యోతకములు. నడకను మద మత్తేభగమనముతోఁ బోల్చవచ్చు. జహంగీరు దృష్టిలోఁ బ్రపంచములోఁ గనిపించు వస్తుజాలమంతయు శృంగారమయమె. ప్రతిదానికి నేదో యొక ప్రయోజనము నూహించుకొనును. ఆతనికిఁ బ్రజారాజ్యమునకంటెఁ బ్రణయరాజ్యమె మిక్కిలి యభిమానపాత్రము. ఆ చక్రవర్తికిఁ గొదువేమి? పారశీ, కాశ్మీర్, గుజరాతీ, మహారాష్ట్ర దేశములలో సౌందర్యపు ముద్దలని పేర్కొనఁబడిన జవరాం డ్రెందఱో తన శుద్ధాంతమునఁ గలరు. ఆ భోగలాలసుని మనస్సులో నేదో యొక చింత. దివారాత్రములు క్రుంగిపోవుచుండెను. ఒకనాఁ డొక రాజోద్యోగి గృహోద్యానములో, నొక క్షణకాలము పాటొక లతాంగి దర్శన మిచ్చినది. మెఱపు మెఱసిపోయిన ట్లయ్యెను. ఆ మధురమోహనమూర్తి పునర్దర్శనమునకై తహతహలాడుచున్నాడు.

1577 సం. లో విజ్ఞానవంతుఁడగు ఘియాస్ బేగ్ అను పారశీదేశస్థుఁ డొకఁడు మొగలు దర్బారులోఁ బ్రవేశించెను. మార్గమధ్యములో ఖండహార్ యొద్ద నతని కొక పుత్రిక జనించినది. ఆమెపేరు మిహరున్నీసా. (స్త్రీజాతికి సూర్యబింబమని యర్థము) పేరునకుఁ దగినట్టి రూపవతి. ఘియాస్ బేగ్ అక్బరుచే నాదరింపఁబడినవాఁడై, జహంగీరు రాజ్యాధికారము వహించిన తర్వాత యున్నతోద్యోగ

మందెను. ఆలీకులి యనువానికిఁ బుత్రికనిచ్చి వివాహము గావించెను. ఆలీకులి జహంగీరుచే బెంగాలునకుఁ బంపఁబడినవాఁడై కారణాంతరములచే వధితుఁడయ్యెను. ఇట్టి పరిస్థితిలో మీరున్నీసా తండ్రియొద్దకు వచ్చి చేరుకొన్నది. లోకములో మంచిచెడ్డలు దాఁగవు. మీరున్నీసా యందచందములు మొగలుసామ్రాజ్యమునం దంతటను పొగడ్తనందినవి. ఒకనాఁడు కనులకు మిఱుమిట్లు గొలుపునట్లుగా మెఱసిపోయిన విద్యుల్లత జహంగీరు బాహుబంధములోఁ జిక్కినది. నాఁటినుండి మీరున్నీసా మహారాజ్ఞి. తనకుఁదానె నూరు మహల్ (మహాసౌధమునకు దీపమువంటిది) అని పేరు మార్చుకొన, నారసజ్ఞుఁడు నూర్జిహాన్ (ప్రపంచమునకు దీపమువంటిది) అని పేరిడెను. తన స్వప్నము ఫలించినదని తృప్తిచెందినాడు జహంగీరు. నూర్జహాన్‌వంటి మధుర మోహనమూర్తి యదృష్టపూర్వము. వారి హృదయము లైక్యమైనవి. వలపుతలఁపులు, ప్రణయఖేలనములు జహంగీరు నితరకార్య పరాఙ్ముఖునిఁ గావించెను. నూర్జహాన్ ప్రేమరసముతోఁబాటు ద్రాక్షాసవము. ఆ ప్రణయయాత్రలో లెక్కకులేనన్ని 'మజిలీలు' గడచుచున్నవి.

నూర్జహాన్ తన సౌందర్యముతో మత్తుఁడైన జహంగీరుపై నధికారము చేయఁ బూనుకొనెను. మొగలు సామ్రాజ్యచక్రముఁ ద్రిప్ప నడుముకట్టినది. ఖుర్రముకు తన తమ్ముఁడగు ఆసఫ్‌ఖాన్‌బిడ్డ ముమ్తాజ్ మహాలు నిచ్చి పాణిగ్రహణము గావించెను. ఆమె యధికారసౌధము తండ్రి,

తమ్ముఁడు, ముమ్తాజ్ మహల్, భర్తలయొక్క శృంగార లోలత్వ మను బునాదులపైఁ గట్టఁబడినది. జహంగీరు "నాకుఁ గావలసినది నూర్జహాన్ బేగముపై స్వాతంత్ర్యము, ద్రాక్షాసవము, మాంసాహారము తప్ప మఱొకటి నాకభిలషణీయ వస్తువు లే" దని చెప్పినాడు. రాజ్యమంతయు బేగము వాంఛానియంత్రణము ప్రకారమె జరుగుచుండెను.

---

౪

జగన్నాథునకుఁ బాండిత్యము కొంగు బంగారమయ్యెను. అచటఁ గల వివిధరాజోద్యోగులఁ జూచినాడు. రసికులఁ గలిసికొనెను. పండితులఁ బరామర్శించినాడు. ఎచ్చటి కేగినను సుస్వాగతమే! అందఱి నోటినుండి మొగల్ చక్రవర్తులు సంగీతసాహిత్యప్రియులని వినికిడి. కవితాలంపటులని పొగడ్త. దర్బారు ప్రవేశము కష్టసాధ్యముగ నుండెను. ఒక పక్షుదినములలో నాంధ్రపండితుని ప్రతిభాకుసుమ మా పట్టణవాసులకు ఘ్రాణతర్పణమైనది. చక్రవర్తివఱకుఁ దెలిసిన దీ విషయము. నూర్జహాన్ దాసీలచే విన్నది. ముఖ్యులవలన జగన్నాథుఁ డాస్థానప్రవేశ మర్థించుచున్నాడు. ఆ ముఖ్యుఁ డెవఁడు? అట్టి సాహసమున కెవరుఁ బూనుకొనలేదు. ఒక రహస్య మతనికిఁ దెలియవచ్చెను. ఆసఫ్ఖాన్ రసపిపాసి. ఆతని పరిచయము కామ్యప్రదాయి.

కాశ్మీరశాల్వాను గప్పుకొన్నాడు. తాను వ్రాసిన సంస్కృతశ్లోకములు గల పొత్తమును గక్షమం దిడుకొని

బయలువెడలెను. ఆసఫ్‌ఖాన్ యింటిముందు సాయుధ భటులు, వారితోఁ దనరాక నెఱింగించెను. సగౌరవ పురస్సరముగా జగన్నాథపండితునిఁ దోడ్కొనిపోయిరి. ఆసఫ్‌ఖాన్ యుచితవిధుల సత్కరించి, కవితాగానముఁ జేయుమని ప్రార్థించెను. తీయని గొంతుక నెత్తి జగన్నాథుఁడు శ్లోకములు చదువఁ బూనుకొన్నాడు. ఆ గొంతుకలో కోయిలస్వరము గూడుకట్టుకొన్నది. ఆ కవితావాహినిలో భావతరంగములుప్పొంగుచున్నవి. పదగాంభీర్యముతోఁబాటు, నర్థగౌరవము, నర్థగౌరవముతోఁబాటు రసస్యందము నా కావ్యకళాభిమానికానందసంధాయకములయ్యెను. కవితాగానముచేఁ బరవశుఁడైన ఆసఫ్‌ఖాన్ లేచి జగన్నాథుని కౌఁగిలించుకొన్నాడు. ఆ సంరంభము గృహమందంతటను ప్రతిఫలించెను.

రెండు మూఁడు రోజులలోఁ గాశ్మీర ప్రయాణము. ఆత్మీయుల గృహములకేగి నూర్జహాన్ పరామర్శింపఁ దలపెట్టినది. ఆనాఁడు తన సహోదరునింట విందు. ఆ విందుతోఁబాటు చెవులవిందు సమకూరెను. పారశీభాషయందామె పండితురాలు. వివిధకవితారీతు లామెకుఁ జిరపరిచితములు. ఉమర్ ఖయ్యామ్ కవితాబద్ధమైన రసధ్వనులు జగన్నాథుని కావ్యగానములోఁ బొడఁగట్టినవి. సంస్కృతమందామొగలురాణికి పరిచయము కడుంగడు స్వల్పము. ఆ కారణముగ నామెకు రసానుభూతిలోఁ గొఱవడినది. నూర్జహాన్ ఘోషాపద్ధతి పరిమితము. ఆమె సౌందర్య గర్వి.

తన సౌందర్యమునుజూచి కవు లున్మత్తులు గావలయునని యా యందాలరాణి తలంపు. అందుచేఁ గవి, పండిత, గాయక, ప్రధానరాజోద్యోగులం దామె ఘోషా పాటిం పదు. దర్శనమిచ్చి మాట్లాడించుచుండును. ఆ గృహములో నొక ప్రత్యేకమంటపమున నుండి జగన్నాథుని కవితారస పానము గావించెను. సోదరుఁడు కపికుమారుని గాఢాలింగ నము గావించుకొనుటఁ జూచి యాశ్చర్యచకితురాలైనది. వెంటనున్న ప్రతిహారితో మహారాజ్ఞి కవి దర్శన మపేక్షించు చున్నట్లు చెప్పి పంపించెను.

జగన్నాథుని భాగ్యము పండినది. ఆసఫ్‌ఖాన్ కేలు బట్టుకొని మహారాజ్ఞి చెంతకుఁ దీసికొనిపోయెను. జగన్నా థుఁడు విభ్రాంతుఁడైనాడు. నూర్జహాన్ చంచలనేత్రయుగ్మ ములో వెలుఁగు జీవజ్యోతులను గాంచ చూపులు మరల్పఁ జాలఁ డయ్యెను. ఆ మనోహరమూర్తిలోని సౌందర్యరసము నొకే యాతురతోఁ ద్రావుచుండెను. శరీరము పులకరించి నది. ఆ రూపసంపద యెంతటి చిత్రకారునకైనను జిత్రింప రానిది. ఎంతటి మహాకవికైనను భావింప సాధ్యముగానిది. ఒక్కక్షణకాలముపాటు జగన్నాథుఁడు ప్రపంచమునె మఱచి నాఁడు. నవపల్లవకోమలమైన కరముతో నొక యాసన ముపైఁ గూర్చుండవలసినదిగా నూర్జహాన్ సంజ్ఞ చేసెను. ఆసఫ్‌ఖాన్, జగన్నాథులు గూర్చుండిరి. నూర్జహాన్ జగ న్నాథు నాపాదమస్తకముఁ బరిశీలించి, యాతని రూపసంపద కువ్విళ్లూరినది.

ఆసఫ్‌ఖాన్ "వీరిది తెలంగాణము. మహాపండితుఁడు, కవి. ఆస్థానగౌరవము నపేక్షించుచున్నాడు. మీకుఁగూడ వీరి శక్తిసామర్థ్యములు శ్రుతపూర్వమే. ఇట్టి మహామహుల నాదరించుటచే మొగలు సామ్రాజ్యవిభవమున కమరత్వము చేకూరఁగలదని నా యూహ. వీరు కొన్నిదినములనుండి యిచటనె యుండిరఁట! నా దర్శనమునకు సైత మిప్పుడె యరుదెంచిరి. మీ రిచటనె యుండుట శుభసన్నివేశము. వారి ముఖతః వివరము తెలియంగు" డని నూర్జహానుకు చెప్పెను. ఆమె శిరోచ్ఛాదితమైన ధవళాంశుకమును జక్క దిద్దుకొనుచు "కవికుమారా! మీవంటి మహామహులకు మా యాస్థానమం దెప్పటికని స్వాగతమే. మానుండి యపేక్షించున దేదియో తెలియఁబఱచుఁ" డని మాటలో సంశత, యునికిలో రాజఠీవి తళుకొత్తఁ బలికెను. జగన్నాథుఁడు "మొగలు సామ్రాజ్ఞి! ఆంధ్రదేశములో రాజులు గొడ్డు పోయినారు. కవిపండితుల కాశ్రయము లేదు. మీ యాశ్రయమె నాకుఁ బదివేలు. సంస్కృతమందు వివిధశాఖలలోఁ బాండిత్యము గలదు. భారతదేశమునఁ గల ప్రధానభాషల తోఁబాటు పారశీభాషయందు నభినివేశమున్నది. ఆశ్రయము లేనిది కవిత శోభింపదు. నా కావ్యకన్య తమ యాదరముఁ గోరుచున్న" దని చెప్పెను.

"తా మాజీవము మాయాస్థానము నలంకరింపుఁడు. అంతకంటె మహాభాగ్యము వేఱొండు గలదా? నాకు సంస్కృతముపై నభిమానము మెండు. కానీ, చారవ

చాలా తక్కువ. మీ కవిత్వము రసస్యంది. రచనలోని యాథార్థ్యమును యథాతథముగ నెఱుంగ సాధ్యము గాకుండెను. తీఱికసమయములలో నాకు సంస్కృతమును నేర్పఁ గోరుచున్నాను. పాదుషాగారు పారశీభాషలోఁ పద్యము లల్లఁగలరు. వారు తమ కళాకౌశల్య మర్థముచేసి కొన సమర్థులు. ఱేపటిరోజు మీ కాస్థానములో స్వాగతమున కేర్పాట్లు గావింతును. దయచేయుఁడు'' అని చెప్పెను. ఆసఫ్ఖాన్ తోడురాఁగా జగన్నాథుఁడు ప్రాసాదమును వెలువడి వచ్చెను.

జగన్నాథుఁ డమందానందముఁ బొందెను. తన కాస్థాన ప్రవేశము దుర్ఘట మనుకొన్న సగౌరవముగా లభించుచున్నది. ఇఁక కష్టములు గడతేఱెనని భావించెను. పాండితీప్రకర్ష దేశదేశముల వ్యాపించుననియు, కవితాలత కావ్యకుసుములఁ బుష్పించుననియుఁ దోఁచెను. ఉజ్జ్వల భవిష్యత్తు నూహించుకొనుచు మహారాజ్ఞి సౌందర్యము నభివర్ణించుకొనుచు విడిదికి వచ్చి చేరెను. భోజనానంతరము నిద్రించుటకుఁ బ్రయత్నించెను గాని, నిద్రాదేవి యావహింప లేదు. మఱునాఁటి యుదయపుఁ గార్యక్రమముఁ దలంచు కొన సంతోషబాష్పములు కనుల నుబికి వచ్చెడివి. మూఁడవ జామున కనుగూర్కినాడు. కామేశ్వరి ప్రత్యక్షము. ఱాలు కరుగునట్లు విలపించుచున్నది. పాపము ప్రోషిత భర్తృక. తల్లిదండ్రుల కరుణాస్నిగ్ధ స్వరూపము. చాల బలహీనులుగఁ గనిపించిరి. గృహము కొన్నిమూలల శిథిలమై నివాసమున

కయోగ్యముగ నుండెను. తనకుటుంబపు దీనస్థితికి జగన్నా థుఁడు విలపించి మేల్కాంచెను. ప్రభాతరేఖ లాకాశమునఁ బొడసూపినవి. హృదయము తహతహలాడుచుండెను. సుఖ దుఃఖము లొక్కపెట్టున జగన్నాథు నావరించినవి. వెంటనే ముంగొండ చేరమని హృదయము బోధించుచున్నది, "పిచ్చి వాఁడా! ఆస్థానగౌరవము నెట్లు త్రోసిరాజనఁగలవు? ఇది నీ తపస్సిద్ధి. ఇచ్చట మహాభోగము లనుభవింపఁగల"వని యాశాపాశము లాగుచున్నది. దుఃఖముపై సుఖమె విజయ మును సాధించెను. అదియె సృష్టిలోని వైపరీత్యము.

దర్బారు మహాలు ప్రేక్షకులచేఁ గ్రిక్కిరిసిపోయెను. మంత్రులు, సామంతరాజు లెల్లరును విచ్చేసిరి. కవి, పండిత, గాయకబృందము నియమితస్థానముల సుఖాసీనమైయుండెను. నాఁటి దర్బారున కొక ప్రత్యేకత గలదు. మూఁడవనాఁడె జహంగీరు కాశ్మీరయాత్ర. తఱుచు దర్బారు జరుపుట జహాం గీరున కభిమతము గాదు. ఆయనకు సర్వకాల సర్వావస్థ లందును నూర్జహాన్ ప్రేమోపాసనమే! తీఱిక యెక్కడ? ఆసఫ్‌ఖాన్ తనవెంట జగన్నాథునిఁ బిలుచుకొని సభాస్థలముఁ బ్రవేశించెను. జగన్నాథుని సభకు పరిచయముఁ గావించుచు "వీరు మహాపండితులు. కవికులాలంకారుఁడు. ఆంధ్రదేశము జన్మభూమి. మొగలుసామ్రాజ్యాస్థానముఁ దన కవితాకన్యకు మెట్టి నిల్లుగఁ జేసికొన నేతెంచెను. అప్పుడె మొగలు సామ్రాజ్ఞి యభిమాన పాత్రుండైన యదృష్టవంతుఁడు. పాదుషాగారి దయను బ్రార్థించుచున్నాఁడు," అని ఆసఫ్

ఖాన్ చెప్పెను. వెంటనే జహాంగీరు లేచి నిలువఁబడి కవి కుమారుని సమీపమునకు రావించి, కౌఁగిలించుకొని "కవివతంసా! మొగలుచక్రవర్తులకుఁ గవిత్వ మభిమానకళ. ఏ భాషయందైనఁ గవిత్వము చెప్పువారిందుఁ బూజ్యులు. మీరాకచే మా సారస్వతాభిమానము ధన్యమైనది. తమరిది మహాంధ్రదేశమంటిరి. ఇది నాకెంతయు ముదావహము. ఆంధ్రులు మహావీరులు. సంస్కృతీనిష్ణాతలు. ఆంధ్రదేశము ను చంద్ర రేఖాంకిత పతాకచ్ఛాయలోనికిఁ గొనిరావలె నని యాశ. ఫలవంతము కాలేదు. ముందుతరములవారైనను మాకోరికఁ దీర్చి మాయాత్మలకు శాంతి సమకూర్పఁ గలరనుకొందును. మీరీ యాస్థానముననె సకల సంపద్వైభోగముల ననుభవించుచు నుండవలసినదిగా నేను బ్రార్థించుచున్నాను" అనియెను. జగన్నాథుఁడు ప్రత్యుత్తరించుచు "భారత సార్వభౌమా! ఇదియె నాకు మహాప్రసాదము. మీయాదరాభిమానముల వివిధ సారస్వతశాఖలు వర్ధిల్లుగాక! ఈ యాస్థానగౌరవము నా భావ్యభ్యుదయము నుజ్జ్వలమొనర్చును. రాజదంపతులు కనుబఱచిన యుదారగౌరవమునకు మిక్కిలి కృతజ్ఞుడ" ననెను. సభాస్తారులెల్లరు చిత్తరువులవలె నేకాగ్రతతో జహాంగీరు, జగన్నాథులవైపు చూచుచుండిరి. విలువైన జరితోఁ దయారుచేయఁబడిన కాశ్మీరశాల్వ నొకటి, వివిధాంబరాభరణాదులను, గొన్ని బంగారు మొహరీల నొకసేవకుఁడు నూర్జహాన్ పంపిన కానుకగాఁ దెచ్చి యిచ్చెను. జగన్నాథుఁడు వానిని కన్నుల

కద్దుకొని స్వీకరించినాడు. నాఁటికి సభ సమాప్తమైనట్లు జహాంగీరు ప్రకటించెను.

రాజోద్యోగులందఱుఁ గాశ్మీర ప్రయాణ సన్నాహముఁ జేయుచుండిరి. అంతఃపురమంతయు నాసంరంభములో మునిఁగి తేలుచుండెను. జహాంగీరు నూర్జహాన్‌తో ముచ్చటింపఁ బ్రయత్నించినాడు. కొన్ని ఘడియలవఱకు నామె దర్శనము కాలేదు. తర్వాతఁ గనిపించి జగన్నాథుని వెంటఁ దోడ్కొని పోవలయునని తెలియఁ బఱచెను. జహాంగీరు మొదటందుల కొప్పుకొనఁడయ్యె. స్వర్ణచషకమున ద్రాక్షాసవమును నింపి, పెదవులకాన్చి, "నేను సంస్కృతమును నేర్చుకొనఁ దలఁచుకొన్నాను. అందుచే జగన్నాథుఁడు కాశ్మీరమునకు వచ్చు టెంతేని యవసరము. అచటి ప్రాకృతిక సౌందర్యమును దన కావ్యజగత్తులో మేళవింపఁ గలఁడు. ఈ ప్రయాణ మా కవికి నొకవిధముగ నుపయోగమే. మీరేల కాదనుచున్నారు?" అని మఱల స్వర్ణచషకమును నింపెను. అందులకు జహాంగీరు "పేరునకుమాత్రము రాజును నేను. నిజముగ రాజ్యమేలునది నీవు. నీయాజ్ఞ కెదురులేదు. కవిత్వమును నేనుగూడ విని యానందింతును. అటులనె కా"నిమ్మని చెప్పెను. జగన్నాథుని ప్రయాణసన్నిద్ధము కమ్మని నూర్జహాన్ చెప్పి పంపించెను. రాజప్రాసాదముచుట్టు జనులు తండోపతండములుగ వచ్చి మూగుచుండిరి. వివిధ వాద్య విశేషములును మ్రోగెను. బంగరుపల్లకి నెక్కి రాణియిలు వెడలెను.

పురముదాఁటువఱకుఁ బ్రజలేతెంచి చక్రవర్తిని సాగ నంపిరి. కాశ్మీరయాత్రకుఁ బోవువారి యందఱ యానంద మొకయెత్తు. జగన్నాథుని యానంద మొకయెత్తు. ఉత్తుంగాశ్వములఁ బూన్చిన శకటముపై జగన్నాథుని ప్రయాణము. తనజీవితములో నిట్టి మహార్దశ పట్టఁగలదని స్వప్నమందైనను దలఁపలేదు. ఎంతమంది పండితులు లేరు? ఎందఱు కవులు రాజాశ్రయముఁ బొందలేదు? ఇట్టి భోగవిలాసము గీఁచుకొన్నారా? కనుసన్న మాత్రమున సర్వమును సిద్ధమగుచుండెను. ప్రయాణశ్రమ మాతని కేశోశమునఁ గనుపట్టుట లేదు. రాజదంపతులు శ్రద్ధగ విచారించుచుండిరి. భావిజీవితాశారేఖ లాసమయములో స్ఫురించెడివి. అనేక నదీనదము లుద్గమించెను. మహారణ్యప్రాంతములు గడచుచుండెను. సారస్వతాబ్ధిలో విజ్ఞాన తరంగముల ప్రాజ్ఞాలఘోషలు చెవుల ప్రతిధ్వనించెడివి. ఆ యాత్ర కవితాయాత్రగా జగన్నాథునకుఁ బరిణమించినది.

కాశ్మీరపు సరిహద్దులలోఁ బ్రవేశించినారు. మార్గమంతయు తరులతానిబిడమై గమనశ్రమముకుఁ గారణమైనది. రాత్రిళ్లు ప్రయాణము నిలిపివైచిరి. మంచు దట్టముగఁ గురియుచుండెను. గుడారములలో నిశీథమున నివసించుచు, పగలుమాత్రమే ప్రయాణము. విశ్రాంతివేళలో నూర్జహాన్ జగన్నాథుని తన నివాసము చెంతకుఁ బిలిపించెడిది. సంస్కృతకావ్యములఁ జదివించుకొనుచు, పారశీభాషలో వ్యాఖ్యానింపఁ జేసికొని కవితారసముఁ గ్రోలుచుండెను. కాళి

దాసుని శకుంతల యామె హృదయములో స్థిరనివాస మేర్పఱచుకొన్నది. జగన్నాథుఁడు మేఘసందేశముఁ జెప్పుటకుఁ బ్రారంభించెను. అందలి యక్షకన్యా విరహవేదన మున కామె కన్నీరుగార్చినది. ప్రకృతిసౌందర్యవర్ణనకు ముగ్ధురాలై కవికులగురుడైన కాళిదాసుని ప్రతిభావిశేషమున కచ్చెరువందెను. జగన్నాథుఁ డెడనెడఁ దానురచించిన గాథలను వినిపించెడివాఁడు. సామ్రాజ్ఞి హృదయములో నాతనికిఁ బ్రత్యేకస్థాన మేర్పడినది. సౌందర్య పిపాసురాలైన యా మొగలురాణికి జగన్నాథుని స్ఫురద్రూపముగూడ ప్రేమ పాత్ర మయ్యెను.

శ్రీనగరమును సమీపించుచున్నారు. ఆ జ్యోత్స్నా పులకిత నిశీథములలో, సుగంధబంధుర మహారణ్యమార్గములలో, హిమప్రసారఝరీ ప్రవాహములలో, మహోత్తుంగ పర్వతాగ్రలస ద్గైరికాధాతుకాంతులలో కరడుగట్టిన ప్రకృతిశోభ లా కవికుమారుని హృదయమును ద్రవింపఁజేయుచుండెను. కాశ్మీర మింతటి రమణీయప్రదేశమని యెఱుంగఁడు. సౌందర్యోపాసి. రసస్నిగ్ధహృదయుఁ డగుటచే నున్మత్తునివలెఁ బ్రతివృక్షమును, బ్రతిలతను, బ్రతిపుష్పమును శ్రద్ధతోఁ బరికించెడివాఁడు. రాత్రివేళల నిద్రపట్టుటలేదు. ప్రకృతి నీరవగాన మతని ముగ్ధుని గావించెడిది. ఉదయకాంత పాదయుగ్మము ప్రభాతలాక్షారుణరేఖలఁ దేజరిలుట తడవుగా జాగృతారణ్యావాస వ్యవస్థకుఁ బరవశుఁ డగుచుండెనన్న నింకఁ బ్రత్యేకముగఁ జెప్పనేల?

దీర్ఘప్రయాణానంతరము శ్రీనగరముఁ జేరుకొనిరి. అచటి ప్రజాసముదాయము రాజదంపతుల కెదురేగి పట్టణ ప్రవేశము నుత్సాహపూరితముఁ గావించెను. వసంతోత్సవము నారాజదంపతులు మహావైభవముగ జరిపిరి. సూర్యుని యుష్ణోగ్రతఁ బ్రతిఘటింప 'షాలిమార్ బాగ్'లో నివాసము. దివ్య సువాసనాభరితములు, మహాకోమలములు, వివిధవర్ణ భాసితములు నైన పుష్పములతోడను, లతాదులతోడను, హిమజల ప్రవాహములతోడను 'షాలిమార్ బాగ్' జహంగీర్ నూర్జహానుల ప్రణయవిలాసమున కనువుగా నుండెను. జగన్నాథుఁడును వారితోఁబాటు మహాభోగముల ననుభవించెడివాఁడు. సాయంకాలము శాద్వల ప్రదేశములఁ గూర్చొని విశ్రాంతిగైకొను నూర్జహానుకు సంస్కృతకావ్యములఁ జదివి వినిపించుచుండుటయే యాతని ముఖ్యచర్య. ఈ విధముగ వారు శ్రీనగరమునఁ గాలము గడుపుచుండిరి.

---

౫

అభాగ్యురాలు కామేశ్వరి. కలలు కల్లలైనవి. నోములు ఫలవంతములు గాలేదు. భర్తకొఱ కెదురుచూచి చూచి కన్నులు కాయలు కాసినవి. ఆలోచించి యాలోచించి మెదడు మొద్దువారినది. హృదయము బాధాసక్తము. విరహవేదన నెదుర్కొనఁగలిగినది కాని, దారిద్ర్యబాధకుఁ దట్టుకొనఁజాలదయ్యెను. క్షణక్షణ మామె హృదయక్షేత్రములో దుఃఖసాగర ముప్పొంగుచుండెను. అంతరంగముల తాకిడికి

జీవితాశాలతలు కాసటబీసట యయ్యెడివి. కామేశ్వరి క్షమాశీలిని. ఆషాఢమేఘము ప్రారంభమునఁ బ్రాణి తపనకారణమైన బిదప సుశీతలకారకమే కదా? అటులనే జీవితములోని కష్టములన్నియు రానురాను సుఖోత్పాదకములనియే కామేశ్వరి దృఢనమ్మకము. జీవితమె యాశాబద్ధము. ఆ యాశాపాశము మానవులను జీవితోన్ముఖులను గావించును. అదియె లేనియెడల సృష్టియొక్క పరంపరాభివృద్ధి యెక్కడ? అట్టి యాశావృక్షమె కామేశ్వరీ జీవితలత కవలంబము. కరుణాస్నిగ్ధమైన యా కనులలో దుఃఖరసము జాలువాఱుచుండెను. దేహము శుష్కించినది. ఇది యాప్రోషితభర్తృక దీనస్వరూపము. కుంతలముల ముడువదు. కనుముల దుఱుమదు. స్వాభావిక శృంగారముతోడనె యుండెను.

పేరుభట్టు దంపతుల వయస్సుతోఁబాటు, సౌఖ్యము కూడఁ దగ్గుచుండెను. వృద్ధులకు రాఁదగిన కష్టములు గావు. విధివైపరీత్యము! ఒకవైపు కుమారుఁడు తిరిగిరాలేదను చింత. వేఱొకవైపు కోడలి దుఃఖము. వారి జీవిత మడకత్తెరలోని పోఁకచందమయ్యెను. వీని నన్నింటిని మించినది మహాదారిద్ర్యము. పేరుభట్టునకుఁ గనుచూపుసైతము తగ్గినది. శ్రీలక్ష్మి దేహ మెండిన మామిడిపండువలె నొదిగినది. దుఃఖభాగులైన యా ముప్వురి యాశాకేంద్రము జగన్నాథుఁడు. ఆతనిరాకకు వాపోవుచున్నారు.

అగ్రహారము సర్వము రైతుల దురాక్రమణకు గుఱియైనది. పేరుభట్టు కుటుంబ పోషణమునకై దురవస్థలు

పడసాగినాడు. కనులలోఁ జూపు, కాళ్ళలో శక్తి యున్నంత కాలము నెడనెడ సంచారము చేయుచు సంపాదించుచుండెను. భగవంతుఁడు మానవులఁ గఠోర కష్ట పరంపరలఁ బరీక్షించునఁట! ఆ పరీక్షనే పేరుభట్టు తట్టుకొనవలసి వచ్చెను. గ్రామీణు లీ కుటుంబముపై సానుభూతి లేనివారలైరి. దీనికిఁ గారణము దుష్ప్రచారము. ఈ ప్రచారాయుధ మమాయక ప్రజానీకములో నెట్టి పరివర్తనమునైనఁ గలిగించును. అది పేరుభట్టుపై బాగుగ పనిచేసినది. ఒక్క కామేశ్వరియే కాలుచేతు లాడింపఁ గలిగిన మనిషి. ఇంటిలో, బనిపాటలు చేయఁగలదు కాని, సంపాదించుట కామెకే యవకాశముగలదు? తల్లిదండ్రులకు చెప్పి పంపించెను. వారు వచ్చి మంచిచెడ్డలు విచారించి కామేశ్వరి దుఃఖములో పాలు పంచుకొనిరి.

లోకము గ్రుడ్డిది. దానికిఁ జెవులులేవు. కనులుండవు. నోరు నిప్పచ్చరము. అయినను వినఁగలదు. చూడగలదు. లోకము నిరాధారులపై నీలాపనిందలు వేయును. అట్టి నిందలు పేరుభట్టు సంపన్నకుటుంబమునకుఁ గూడ సంప్రాప్తించెను. అసూయాపరు లూరకుందురా? కామేశ్వరీ సత్యశీలమునకె కళంకమాపాదించిరి. పాడులోకము! మానవతి ప్రాణభంగమునకైనను సహించుఁగాని, శీలమున కాపాదింపఁబడిన కళంకము నోర్చుకొనఁ జాలదు. అందుచే నామె హృదయము భగ్నమనెను. భర్తృవిగహముతో బాధపడెను. దారిద్ర్యముతోఁ గృశించినది. ఇంక నా గ్రామ

ములో నుండుట సరికాదనుకొని యత్తమామలకుఁ దన మనోగతభావము నెఱింగించెను. కాలప్రభావమున కేమన లేక సమ్మతించిరి. తమకుఁ గల యిల్లు, పొలము ఋణదాతలకుఁ గట్టిపెట్టిరి. వారికిఁ గల సర్వస్వము నానాఁటితోఁ ద్యజింపవలసి వచ్చెను. మనుష్యులు మాత్రము కట్టుబట్టలతో మిగిలినారు. ఒక్కవస్తువును మాత్రము భద్రముగా దాచిరి. కూచిపూడికిఁ బ్రయాణము.

తమయాశలన్నియు బూడిదలోఁ బోసిన పన్నీటిచంద మైనందులకు కామేశ్వరి తల్లిదండ్రులు వగచిరి. ఒకేయొక బిడ్డ. వివాహమై పదునైదు సంవత్సరము లయ్యెను. ఆమె కడుపున నాల్గుకాయలు కాయునని వారితలంపు. ఇట్టి నీచదశ తమబిడ్డకు పట్టుననుకొనలేదు. సగౌరవముగా వారల నాహ్వానించిరి. కలిగినదానితోనే తినుచు కాలము పుచ్చుచుండిరి. లోకము నోరెవరు మూయింపఁగలరు? కూచిపూడి బ్రాహ్మణబృందములో ముంగొండవాసన బయలుదేఱెను. కామ్వేశరి జీవితమార్గ మెటుచూచినను గంటకావృతమే! భర్తలేని స్త్రీజీవితము నరకకూపమని నిశ్చయించుకొన్నది. దానినుండి బయలుపడు మార్గమాలోచింప సాగెను.

తనమనోభీష్టము తల్లిదండ్రులకు, నత్తమామలకు నెఱింగించినది. వారికిఁ గామేశ్వరి సాహసమశనిపాతముగఁ దోఁచెను. వారించుటకెన్నియో విధములఁ బ్రయత్నించిరి. ఆమె పట్టువదలలేదు. చివఱకంగీకరించిరి. కర్ణాకర్ణిగ జగన్నాథుఁడు మొగలుసామ్రాజ్యస్థానమున నున్నాఁడని

తెలిసినది. కాబట్టి భర్తనెటులనైనఁ గలిసికొనవచ్చునని కామేశ్వరియాశ. తండ్రి చాలదూరము చెప్పిచూచెను. "తండ్రీ! నాకు తాము బోధచేసి చేయునుపకారమునకంటె నపకారమె మెండు. ఈ పాడుజీవితము నేనింక యనుభవింప లేను. భర్తలేని స్త్రీ శోభింపదను నానుడి ప్రత్యక్షరసత్యము. అన్నియుఁ దెలిసిన తామిట్లు మాట్లాడుటఁజూడ నాకు విచిత్ర ముగ నున్నది. గృహిణికి భర్తృసాన్నిధ్యమే వాంఛ నీయము. నాకిచట నెన్నిసౌఖ్యములున్ననేమి? భర్తలేకున్న బాధాకరములే కదా? మీరీవిషయమున సకల మానవ సామాన్యమైన పుత్రికావాత్సల్యరసమును నాపై వర్షించి నాప్రతిష్ఠను బలిపెట్టకుడు. నా గమ్యస్థానమునకు నన్ను బోనిండు. పరిహాసభాజనమైన యీ జీవితమునకంటె నదియె మేలు. దురుద్దేశ్యపూరిత ప్రజల కట్టెదుట నుండుట నొక్క క్షణమేనిఁ దగదు. బిడ్డనిచ్చిన దోషమునకీ ముదివగ్గులను సంరక్షించుభారము మీపైఁ బడినది. నా ఋణము నీ రూప మునఁ దీర్చుకొనుఁడు. బ్రతికి సుఖముగ వచ్చితినేని మీ మధురస్వప్నములు ఫలింపఁగలవు. పశ్చాత్తాపపడ నవ సరము లేదు. నాయీప్రార్థన మన్నింపుఁడు," అని విలపిం చెను. తండ్రి కన్నీళ్ళుకార్చి "ప్రపంచవ్యవస్థ స్త్రీల నర్థము చేసికొనదు. నీవాఁడబిడ్డవు. మహారణ్యములను, నదనదము లను గడచి శతయోజనాధిక ప్రదేశము నెట్లుచేరఁగలవు? నీప్రయాణము వివిధకష్టపరంపరాయాతము. మమ్మేల నీ వయస్సులో బాధపెట్టెదవమ్మా!" అనెను. తండ్రిని గాఢ

పరిష్వంగమునఁ దనిపి, "యిది నా పురాకృత కర్మము. తప్పించుట నీకసాధ్యము. నాదారిని నన్ను పోనిమ్ము," అని బ్రతిమాలుకొన్నది. తండ్రి విధిలేక సమ్మతించినాడు. తల్లి పుట్టెడు దుఃఖములో మునిఁగినది. అత్తయొద్ద సెలవుగైకొని మామను సమీపించినది. ఆయన బాష్పసంకలిత నేత్రుఁడై "నీసాహసము లోకాతీతము. చేసికొన్న నిర్ణయమును మార్చుట సాధ్యమగునట్లు లేదు. నీ పుణ్యముననైనఁ గుమారుని జూడఁగల నేమో యనువాంఛ పొడముచున్నది. రూపవతులైన స్త్రీల సాధుత్వవిషయమున దుర్మార్గులు జనులు. నీదీక్ష లోకనింద నెదుర్కొనుఁగాక! నీవిప్పుడు జగన్నాథుఁ డిల్లు వదలిపోయినప్పటికంటె నెంతో మాఱినావు. నాఁడు యువతివి. నేఁడు ప్రౌఢవు. మహాసిద్ధుఁడు, భోగలాలసుఁడు, సామ్రాజ్యాస్థాన గౌరవమందినవాఁడు నగుట, నాగర్వముతో నిన్ను భార్యగా గుర్తింపకఁ బోవుటయు సహజము. ఆ పరిస్థితిలో నీ జీవితోద్దేశ్యమే తాఱుమాఱు కాఁగలదు. అందులకు నేను నీకొక యభిజ్ఞాన మొసంగెదను. తిండికిలేక పస్తులుండినను, నాకీ బహూకృతాభరణమును విక్రయించుటకిష్టము లేకుండెను. ప్రాణప్రదముగఁ గాపాడినాను. చాల విలువైనది. మహారత్నఖచిత స్వర్ణకంకణము. ఇది శ్రీకృష్ణదేవరాయలు మా తాతయొక్క కళాకౌశల్యమునకు మెచ్చి యిచ్చిన వీరకంకణము. జగన్నాథుఁడు దీనిఁగాంచి యువ్విళ్లూఱెడివాఁడు. ఇది చూపించినచో నైన నిన్ను గుర్తించును. చోరులబారిని పడకుండ నెట్లు ప్రయాణము గావించెదవో

చూచుకొమ్ము. సుఖముగఁ బోయిరమ్ము. నీ మనోభీష్టము నెఱవేఱుఁగాక!" అని యొక నిట్టూర్పు విడిచెను. కామేశ్వరి యొక ముల్లెను చేతఁబట్టుకొని ప్రయాణమై యిలువెడలినది.

---

౬

జగన్నాథుఁడు నిత్యానంతసౌఖ్యముల నోలలాడు చుండెను. తనకర్తవ్యమును మాత్రము మఱచినాడు. తల్లి దండ్రులు, కామేశ్వరి స్మృతిపథములో లేరు. సౌఖ్యములో గతచరిత్రమును గమనింపకుండుట యనునది మానవత్వమునకు వేఱుపుఱుగువంటిది. కవితాపీఠమెక్కి యానందసామ్రాజ్యము నేలుచున్నాడు. దినదినమున కాతని కావ్యలత ప్రవర్ధమానమై, వాఙ్మయప్రపంచములో నల్లుకొని పోవుచున్నది. పూలు పూసినవి. వాసనలు విరజిమ్మినవి. ఆ వాసన లాఘ్రాణింపని రసికుఁ డొక్కరుఁడును దేశములో లేడు. భామినీవిలాసరచన కుపక్రమించెను. గాథాలహరులు నాఁటికె పండితప్రశంస నందుకొన్నవి. నూర్జహాన్ అతిలోక సౌందర్యమె జగన్నాథుని నర్మకవిత్వమునకుఁ బ్రోత్సాహకరమేమో! ఎవరెఱుంగుదురు? ఆయన కవితారచన వివిధ రీతుల నలరారుచుండెను.

భారతసాంప్రదాయములను మేళవించినాడు. ప్రకృతిలోని మహత్తరసౌభాగ్య మాకవితారీతుల నిమిడించెను. నవరసములతోఁబాటు వాత్సల్యరస మొక నూతనసృష్టి. జగన్నాథునిపేరు దేశములో నలుమూలల మాఱుమ్రోగు

చుండెను. పండితు లాయనతోఁ జర్చించుటకు వెనుదీయు వారు. సాక్షాత్సరస్వతీస్వరూపమని వారు వీరనక నెల్లరుఁ బొగడుచుండిరి. ప్రాఁత క్రొత్త భాషాసాంప్రదాయముల జీర్ణించుకొన్న రసికాగ్రేసరుఁడు. దేని నూహించిన, నేమి వ్రాసిన నా కళాతపస్వి కొక ప్రత్యేకత గలదు. కాళిదాసుని తర్వాత నింతటి ప్రతిభావంతుఁడు పుట్టలేదని విద్యావంతులు ఘోషిల్లిరి. తార్కికధోరణితో నలంకారశాస్త్రమునకుఁ గ్రొత్త మెఱుఁగు వెట్టి రసగంగాధర రచనకుఁ బ్రారంభించెను. కవిత్వము పాండిత్యము నొకచో నుండుట ప్రపంచ సహజము. వానికిఁ దోడుగా విమర్శనాశక్తి సంఘటితమగుట కడుంగడు దుర్లభము. జగన్నాథుని ప్రతిభ కీ మూఁడును గేంద్రము. ఇంక కావలసిన దేమి? ఇంతయున్నను జగన్నాథునకుఁ దృప్తిలేదు. నూర్జహాన్ వలె వీరత్వమును బ్రేమించువాఁడు. అవకాశము లభించినప్పుడెల్ల ఖడ్గవిద్యను నేర్చుచుండెను. అతనికి వేఁట యొక వినోదరంగము. బాణప్రయోగమందు దాటి తేటినాడు. వివిధవిద్యారీతులవలెనే వివిధ యుద్ధగతు లిప్పు డా జగన్నాథునకుఁ బ్రియములు. నేఁడు మహాకవి, పండితప్రకాండుఁడే గాక—మహాయోధుఁడు. ఆ మొగల్ రాజకుటుంబములో నొకఁడుగా మెలఁగుచు హాయిగా కాలముగడపుచుండెను.

జహంగీరు ప్రకృతిసౌందర్యోపాసి. అందుచేతనే కాశ్మీరమునకు విశేషముగఁ బోవుచుండెను. ఆయనకుఁ బ్రకృతిని బ్రేమించు శక్తి కలదు. కళలలో కెల్లఁ జిత్రకళపై నభిమానము

మెండు. విజ్ఞానసంపత్తి యనన్యసాధ్యము. తన న్యాయపరిపాలనలో పెద్ద పిన్నల తారతమ్యముండెడిది కాదు. అందఱు సమానమే. తన మందిర ప్రాంగణమున నొక గొలుసును వ్రేలాడఁగట్టియుండువాఁడు. న్యాయమును గోరుటకు వచ్చిన వా రా గొలుసునుబట్టి లాగిన నంతఃపురములోనుండు ఘంట మ్రోఁగును. జహంగీ రెంతటి మహాకార్యనిమగ్నుఁడై యున్నప్పటికిని తక్షణమేవచ్చి న్యాయవిచారణ చేయువాఁడు. న్యాయపరిపాలనా నిర్వహణలో జహంగీ రపూర్వపద్ధతులఁ బ్రవేశపెట్టెను. దేశముయొక్క సామాన్య రాజనీతిలో నంత శ్రద్ధలేదు. ఆ యవకాశమును నూర్జహాన్ చక్కఁగా నుపయోగించుకొనెను. రాజ్యచక్రమంతయుఁ దానె నడపుచుండెడిది. జహంగీరునకుఁ బ్రియమైనది నూర్జహాన్ ప్రణయ సామ్రాజ్యము. మధుపానము. భవిష్యత్తుకు సంబంధించిన విషయాల కాయన హృదయములో స్థానమే లేదు. కొడుకులను గుఱించిన యొక ప్రశ్న మాత్రము కలవరపెట్టుచుండెను. జీవితానంతరము మొగల్ సింహాసనమునకై కుమారులెల్లరుఁ బోరొనర్తురు. అందు నూర్జహాన్ ప్రధానపాత్ర వహింపఁ గలదు. ఆ విషమపరిస్థితి కలుగకుండ చేయవలెనని దివారాత్రము లాలోచించుచుండెను.

నూర్జహాన్ ప్రతిభాతిశయము, పరిపాలనాదక్షత కీర్తితమయ్యెను. నల్లమందు విశేషముగ నుపయోగించుటచేత, నిరంతర మధుపానసేవనమున జహంగీరు దేహారోగ్యము క్షీణింప మొదలిడినది. భర్తృమరణానంతరము ఖుర్రం

సింహాసన మెక్కెను. తన యధికారమంతట నంతరించునని నూర్జహాన్ భయము. తక్కువగ త్రాగమని భర్తకు బోధించెను. ఆసఫ్ ఖాన్ తన యల్లుఁడగు షాజహాన్ కొఱకు నిగూఢముగఁ బ్రయత్నించుచుండెను. దినదినప్రవర్ధమానమగుచున్న షాజహాన్ రాజ్యాధికారావకాశముల కామె యేకాకినిగాఁ బ్రతిఘటింపవలసివచ్చినది. దానిచే నామె యాలోచన లన్నియు భవిష్యత్తుపై నుండెను. నిద్రాహారములు వదలిపెట్టినది. అధికార వ్యామోహ మా కుసుమకోమలిని పాషాణకర్కశముగ మార్చివైచెను. అబలాశబ్దము స్త్రీజాతికిఁ గళంక మాపాదించునదిగా ప్రపంచమునకుఁ జాటిచెప్పిన సాహసికురాలు.

నూర్జహాన్ పర్షియా దేశపు నతిలోక సౌందర్యవతి. ఆరోగ్యవంతురాలు. ఆమె శక్తి వీరపురుషునికి దీటు. ఏదో యొక కార్యక్రమ మా జీవితమున కొక ప్రత్యేకశీలము. గుఱ్ఱపుస్వారి, వేఁట, బాణప్రయోగ దక్షత వెన్నతోఁ బెట్టిన విద్య లా మొగలు రాణికి. గొప్ప మేధాసంపత్తి, సంస్కృతి కలిగియుండుటచే సారస్వతమన్నను, లలితకళలన్నను మక్కువ. వేషాలంకారములలో విప్లవాత్మక పరిణామములు దెచ్చినది. ఆమె జీవితోద్దేశ్యమే భోగలాలసత్వము—నధికారము. తన యధికారముద్రలో నొక భర్తనేకాక, యెట్టి తీవ్రాభిప్రాయములుగల వారినైన నుంచుకొనఁగలిగెను. నూర్జహాన్ రాజకీయదక్షతచే చాలకాల మధికారము సాగించెను. ఆమె బీదల విషయములో

దానపరురాలు, మంత్రులపట్ల సహాయపరురాలు, శత్రువుల పట్ల భయంకరిణి. అహంకారముచేత, సధర్మమునకు జంకని కారణముచేత భవిష్యత్తులో దుఃఖభాగిని కావలసివచ్చెను. మత విషయాలలో నామెకుఁగల ప్రాఁతవాసనలే ముమ్తాజ్ మహల్, షాజహానుల వ్యతిరేకతకు ముఖ్యకారణములైనవి. పక్షపాతబుద్ధి, రాజ్యాధికారవాంఛా విశేషము నందఱ కసూయాగ్రస్తమయ్యెనుగాని. సాహసస్త్రీత్వ మెవరును బొగడఁజాలకుండిరి. 1622-27 సంవత్సరముల మధ్య బ్రహ్మాండమైన యుద్ధములకు, రక్తపాతమునకు నూర్జహాన్ ముఖ్యకారణము. ఈ కారణముచే నామెకు రావలసిన కీర్తి కంటె, నపకీర్తియె సంప్రాప్తించినది. ప్రొద్దుతిరుగుడు పూవువలె నూర్జహాన్ జీవితములో సుఖదుఃఖములు తొంగి చూచినవి.

1627 సం॥లో నూర్జహాన్ జహంగీరులు కాశ్మీరమునకు వెళ్ళి, తిరిగి వచ్చుచుండిరి. జహంగీరున కాయాత్రయే వైకుంఠయాత్ర. లాహోరునకు వచ్చులోపల మార్గమధ్యముననే మొగలురాణి నొంటరిఁజేసి దివంగతుఁడైనాడు. నూర్జహాన్ ఆశాప్రపంచ మంధకారబంధురము. ఆసఫ్ ఖాన్ వెంటనే యామె స్వేచ్ఛాప్రవర్తనమును నిషేధించెను. షాజహాన్ కొడుకై యతఁడు వేయికన్నుల శత్రుచర్యలను బరిశీలించెడివాఁడు. నూర్జహాన్ అధికార—బాహాట జీవిత మంతటితో ముగిసినది. ప్రతిపక్షశక్తుల నన్నింటి నెదుర్కొని షాజహాన్ సింహాసన మధిష్టించెను.

పారంపర్యముగ మొగల్ సామ్రాజ్యమునకు వచ్చుచున్న యఖండఖ్యాతి నినుమడింప కంకణముఁ గట్టినాఁడు. ప్రతిజ్ఞ గైకొనెను. ముమ్తాజ్ మహల్ యందాల రాణి—గుణముల ప్రోగు. మొగలురాణి పదవి కంతయు యోగ్యురాలు. సంవత్సరమునకు రెండులక్షల రూప్యములు నూర్జహాన్‌కు భరణము. నిజమైన ప్రౌఢసుమంగళివలె నుండి, యాడంబర వేషాభరణాదులను ద్యజించి సాధారణముగా జీవితముఁ గడపుచుండెను.

సామ్రాజ్యములో వచ్చినమార్పు జగన్నాథుని స్థాయి కేమాత్రము భంగము కలిగింపలేదు. షాజహాన్ చాలకాలమునుండి తండ్రికిఁ దిరుగుబాటుచేసి దూరప్రాంతముల నుండుటచే జగన్నాథున కతనితో నూత్నపరిచయమే! ఆసఫ్‌ఖాన్ మొదట మొగలురాజు—కవిరాజుల సమావేశముఁ గావించెను. ఒకరినొకరు గాఢాశ్లేషములఁ జేసికొనిరి. అపుడు షాజహాన్ "కవిపుంగవా! మీకవిత్వముఁ బండితులనోట విని యానందించినాఁడ. దర్శనభాగ్యము నేఁడు కలిగినది. మీరును, మేమును స్నేహితులవలె జీవింతము. ఈ మొగలు సామ్రాజ్యమును వీడి రాజు లెందఱైనఁ బోవచ్చును. రాజ్యమే నశింపవచ్చును. మీ యమరకవితాప్రభావ మొకటియే మారాజ్యమునకు శాశ్వతికముఁ జేకూర్పఁగలదు," అని ప్రార్థింప జగన్నాథుఁ డుత్సాహాపూరితుఁడై, తన కృతజ్ఞతఁ దెలిపెను.

---

## ౭

కామేశ్వరి సౌందర్యము లోకులకుఁ గంటగింపు. దాని కేమిచేయఁగలదు? స్త్రీకిఁ దనరూపమె తనశత్రువు. అందులో విదేశగమనము. అతిప్రయాసచేఁ గొన్ని గ్రామములు గడచెను. లోకులు తన్నుఁజూచి పరిపరివిధముల వ్యాఖ్యానించుచుండిరి. తన సహజసౌందర్యమును మఱుగుపఱచుకొనఁ బ్రయత్నించెను. నెత్తి విఱుఁగఁ బోసికొన్నది. కాషాయాంబరములు ధరించెను. నొసట దివ్యతేజస్సు వెదఁజల్లు కుంకుమబొట్టు. సాపఱ కాయభాగిని యోగినివలెఁ గనుపట్టెను. ఎంతటి వికృతవేషమును వైచుకొన్నను సౌందర్యము మఱఁగుపడునా? బహుశ్రమతోఁ బ్రయాణము సాగించుచున్నది. ఇంకొక సమస్య. కంకణము చాల విలువైనది. ఎవరికంటనైనఁ బడిన నపహరింతురు. భద్రముగ దాఁచుకొనవలయును. ప్రాణప్రదము. అదిపోయిన నూహలన్నియుఁ బుగ్గిపాలగును. కఠోరోపవాసములకు గుఱికావలసి వచ్చెడిది. దానఁజేసి శుష్కించుచున్నది దేహము. మహాప్రవాహము నెదురొడ్డు పర్వతమువలె నామె హృదయము వీనికన్నింటికిని తట్టుకొనుచుండెను. ఆ దీక్షాపటిమను కష్టపరంపరలు జయింపఁజాలకపోయినవి.

కంటకావృతమార్గములు సైతము పూలబాటలఁ బోలినవి. ఘోరాంధకారబంధుర యామినులు రాకాచంద్రరాత్రములయ్యెను. ఉపవాసక్లాంతశరీరముగూడ నుత్సాహముగనె యుండెను. అనవాప్తనిద్రాసముచ్ఛ్రియములైన

కనులలో నిరాశా రేఖలు తా వేర్పఱచుకొన్నవి. వయస్సును బట్టి తనలో వచ్చిన మార్పును గొలబద్దగా పెట్టుకొని భర్త యొక్క రూపము నూహించుకొనుచున్నది. సమావేశ మెప్పు డెప్పుడా యని యువ్విళ్లూరుచుండెను. మహానదులు దాఁటి, ఘోరాటవుల నధిగమించి, రెండుమాసములకు వింధ్యోత్తర దేశముఁ బ్రవేశించినది.

అధీత కావ్యపంచకయు, నభ్యస్త నాట్యసంగీతము నగుట పండితచర్చలు కొంతకుఁ గొంత నర్థము చేసికొను చుండెను. ఏ గ్రామమున కేఁగినను మఠములలో దిగుటఁ జేసి పండితుల పరిచయము. నాఁడు గ్రామములలోని మఠములు, సత్రములె విద్యాలయములు. కొన్నిమఠముల మహాపండితులు విద్యాబోధన చేయుచుండిరి. అట్టివారు కామేశ్వరిని గాంచి, సంస్కారము గలదానిగా గుర్తించి యన్నాహారదానాదుల సత్కరించుచుండిరి. వారిలో నొక రితో నొకరు శాస్త్రచర్చకుఁ గడఁగినప్పుడు జగన్నాథ రచిత శ్లోకములఁ జదువుచు, సాలంకారిక సాంప్రదాయముల ప్రశంసవచ్చినప్పు డాతని వాదనఁ బేర్కొనుచుండ కామే శ్వరికిఁ బుట్టెడు సందేహము కలిగెడిది. "పండితులారా! ఆ జగన్నాథుఁ డెచ్చటివాఁడు? ఆతఁ డెక్కడున్నా" డని ప్రశ్నించును. అందులకు వారు "సుమంగళీ! జగన్నాథుఁ డాంధ్రుఁ డని ప్రతీతి. మహాపండితుఁడు. మొగలుసామ్రాజ్య స్థానమున నున్నాడు. ఉద్గ్రంథరచన సాగించి ప్రసిద్ధికెక్కెను. ఆలంకారికులలోఁ బ్రథమగణ్యుఁడు" అని చెప్పుచుండిరి.

ఆ మాటలు వినుటతోడనె కామేశ్వరికిఁ గలుగు యుత్కంఠత వర్ణనాతీతము. ఆనందాశ్రువులు రాల్చెడిది. వెంటనే కొంత తడవునకు రుద్ధకంఠముతో "వారి దర్శనముఁ జేసికొనుటకు వీలున్నదా?" అని యడుగుచుండెను. "మొగలుసామ్రాజ్య పీఠమునకు వెళ్లిన లభ్యమగు" నని చెప్పుచుండిరి. కామేశ్వరి మనస్సులో నేమేమియో భావించుకొనుచు, ప్రయాణమై పోవుచుండెను. భర్త విఖ్యాతిని వినిన దర్శనమున కాతురత, రానురాను ప్రయాణము శ్రమభూయిష్ఠమయ్యెను. భాష తెలియదు. ఆ దేశాచారములు క్రొత్తవి. స్థానిక ప్రజ లీమెను ప్రదర్శనజంతువువలె, బౌద్ధసన్యాసినివలెఁ జూచుచుండిరి. శీతాతపపవనములకుఁ బ్రతిఘటించినది. భర్త రచించినవని చెప్పబడు కొన్ని శ్లోకములు కంఠస్థము చేసికొనెను. వానిఁ బఠించుచు, తత్కవితారసవాహినిలో నోలలాడుచుండెను. జగన్నాథుని భార్య నని చెప్పుకొనుట కొక్కొకమాఱు సాహసించెడిది. అయినఁ దన యీదౌర్భాగ్యపు వేషముచే నాతని కీర్తికిఁ గళంక మాపాదించునేమోనని యుద్రేకమడంచుకొనును. ఊహాసౌధములను గట్టుకొనుచు, చివరకు యమునాతీరమునకు వచ్చి చేరెను. మొగలు సామ్రాజ్య లక్ష్మి రూపురేఖలు పొడఁగట్టినవి ఆ యున్నత సౌధములను, గోటలను, సింహద్వారములను గాంచుటే తడవుగా నచటి భోగలాలసత్వ, మైశ్వర్యౌన్నత్యము నర్థమయ్యెను.

ఆసఫ్‌ఖాన్ కవి, పండితుఁడు, రసికుఁడు. ఆయన ఋణముఁ దీర్చుకొనుటయె జగన్నాధుని సంకల్పము. అసఫ

విలాసమనుపేర నొక కావ్యమును వ్రాసెను. వ్యాకరణ శేముషీ విశేషము, శాస్త్రసంశోధన లోకమునకుఁ దెలియునట్లు సుప్రసిద్ధ భట్టోజి వ్యాకరణశాస్త్ర వ్యాఖ్యానమును విమర్శించుచు ప్రౌఢ మనోరమాకుచమర్దనమును రచించెను. అందు జగన్నాథుని ప్రతిభాతిశయము పరాకాష్ఠ నందుకొన్నది. ఆ గ్రంథము మహాపండితులకు సైతము ముక్కుమీఁద వ్రేలిడుకొనఁ జేసెను. జగన్నాథుఁ డాంధ్ర దేశఖ్యాతికి మెఱుఁగువెట్టినాఁడు. అందులో వ్యాకరణ - తర్క - ప్రతిభలు గంగా-యమునా-సరస్వతులవలె నైక్యమైనవి. త్రివేణీ సంగమములో స్నానముఁజేసిన యాత్రికుఁడు పాపనివృత్తుఁ డైనట్లు సాహిత్య యాత్రికుఁ డా గ్రంథపఠనచే సందేహనివృత్తుఁ డగుచుండెను.

షాజహాన్ పుత్రుల బాహుబలముచే మొగలు సామ్రాజ్యపుఁ బొలిమేరలను విస్తరింపఁ జేసికొనుచుండెను. జహాంగీరువంటి భోగలాలసుఁడు కాకున్నను, ముమ్తాజ్ మహల్ ప్రేమరస ముగ్ధుఁడు. కావ్యలంపటుఁడు కూడ. మొగలురాణి నెంతగ ప్రేమించుచుండెనో జగన్నాథుని కావ్యకన్యనుగూడ నంతగఁ బ్రేమించుచుండెను. రాజ్య కార్యములకంటె సాహిత్యలంపటత్వ మెక్కువ. జగన్నాథుని వాక్కునుండి స్రవించు కావ్యమధువు సర్వదా సేవించువాఁడు. భాషాపోషణకుఁ గంకణము కట్టుకొనెను. పండితాదరణము నిత్యకృత్యము. ఆతని రాజ్యములో దానధర్మములు, కళాపోషణ మత్యున్నతస్థాయి నందుకొన్నవి. ప

మొగలు చక్రవర్తులును సాధింపని హిందూ – మహమ్మదీ యైక్యతను సాధించినాడు. తన కళాప్రియత్వమును వేనోళ్ళఁ జాటు రమణీయమయిన నెమలి సింహాసనము నొక కోటి రూప్యములను వెచ్చించి తయారుచేయించెను. మొగలు సామ్రాజ్య చరిత్రలో నిది స్వర్ణయుగ మనవచ్చును. ఈతని కాలములో శిల్పకళ వృద్ధియయినట్లు మఱి యెవ్వరికాల ములోఁగా లేదు. కోట్లకొలఁది ధనమును వ్యయించి ఆగ్రాలో జామీామజీదు, ఢిల్లీలో ముత్యాలమజీదును గట్టించినాడు. ఢిల్లీకి సామ్రాజ్యపీఠమును మార్చుచు ప్రత్యేకముగ నొక నగరమునె 'షాజహానాబాద్' యను పేర నిర్మించెను. బ్రహ్మాండమైన యొక రాజమందిరమును గట్టించి "భూభాగ ములో విచిత్రమైన వస్తు వేదైన నున్నదన్న నది యిదియె-యిదియె!" అని నొక్కి నక్కాణించినాడు. సామ్రాజ్య ధనాగారమును కళాపోషణకై కొల్లఁగొట్టిన చక్రవర్తి షాజహాన్.

కామేశ్వరి ఢిల్లీ చేరుకొన్నది. కాషాయాంబర వేష మనుచితముగఁ దోఁచెను. మంచి వలువలు లేవు. ముమ్తాజ్ మహాల్ దీనుల నభిమానించునని విన్నది. సరాసరి రాజాంతః పురముఁ బ్రవేశించెను. అంతఃపురోద్యానములో నామె జలక్రీడ లాడుచుండెను. కామేశ్వరి బెదరుచూపుల చూచు చుండఁగ దాసీ లామెను సమీపమునకుఁ దోడ్కొని తెచ్చిరి. సవినయముగా ముమ్తాజ్ మహాల్‌తో "పట్టపు రాణి! నేను గోల్కొండ సులతానుల యంతఃపురమున నర్త

కిగా నున్న పఠాన్ స్త్రీని. కారణాంతరముల నిచటికి వచ్చి
తిని. ఆశ్రయ మిచ్చి కరుణింపు" మని ప్రార్థించెను. రాణి సమ్మతించినది. ఆమెకు విలువైన వలువలు, సొమ్ములు నలంకరించుకొన దాసీ లొసంగిరి. కామేశ్వరి పారశీదేశపు స్త్రీల కట్టువలె నొకపావడ కట్టుకొని, యాహస్తాంత మాక్రమించుకొను నట్టి కంచుకముఁ దొడిగెను. ఢక్కామల్లు మేలిముసుంగు. ఆమెను బోల్చుకొనుటకై నను సాధ్యము గాకుండెను.

జగన్నాథుని సత్కరించుటకై షాజహాన్ తలపెట్టినాడు. ప్రత్యేకముగ నందులకై దర్బారు. మంత్రులు, సామంతులు, రాజప్రతినిధులు సమావేశమైరి. కవి, పండిత, గాయక, శిల్పబృందము సభలో నాసీన మయ్యెను. షాజహాన్ తన నెమిలిసింహాసనము ప్రక్కనే యొక్క స్వర్ణాసనము జగన్నాథునికై నియోగించెను. అంతఃపుర స్త్రీ లెల్లరు సభను దిలకింప యవనికాంతరమునఁ గూర్చుండిరి. కామేశ్వరి హృదయములో నానందసాగర ముప్పొంగెను. నాఁ డామె ముఖములో సంతోష రేఖలు ప్రతిఫలించినవి.

జగన్నాథుఁడు సభలోనికిఁ బ్రవేశించెను. చీమ చిటుక్కుమన్నంత నిశ్శబ్దము. విలువైన కాశ్మీరపుశాలువ. పట్టువస్త్రములు ధరించినాడు. చేత నొక గ్రంథము. సభాసదుల దృష్టులన్నియు నాతనిపైఁ బడెను. గజయానము జ్ఞప్తికిఁ దెచ్చుచు సభామంటప మధ్యప్రదేశమున కేతెంచెను. ఆతని చక్కఁదనము నొకేవిధముగఁ దమలో తాము

శుద్ధాంతస్త్రీలు వ్యాఖ్యానించుకోసాగిరి. కామేశ్వరి బ్రహ్మానందపరవశురాలై నది. కను లానందాశ్రువులఁ గ్రమ్ముకొనఁ జూపున కభ్యంతరమయ్యెను. వాని నామె పైఁటకొంగుతోఁ దుడుచుకొనుచు నున్నమితనయనయై తనివితీర వీక్షించుచున్నది. ఆమెలోఁ గలిగిన పారవశ్యవిభ్రమమునకుఁ బార్శ్వవర్తిను లాశ్చర్యచకితులైరి. కామేశ్వరి కప్పుడు లోకజ్ఞానము నశించినది. దేహము పులకించెను. తన నోములు ఫలించుననియు, నిగూఢ మధురవాంఛలు నెఱవేఱుననియు, నాశాకిరణము తొంగిచూచుచున్నదనియు నా ఘట్టమునఁ దర్కించుకోసాగినది. షాజహాన్ ఎదురేఁగి జగన్నాథుని గాఢాలింగనముఁ గావించుకొని, తన పార్శ్వమున నిర్ణీతమైన యుచితాసనాసీనుం గావించెను. మొగలు చక్రవర్తి చూపిన గౌరవమునకుఁ బొంగి పౌరలు నుత్సాహముతో షాజహాన్ కీర్తిగానము చేయుచు శ్లోకద్వయమును జగన్నాథుఁ డాశువుగాఁ జెప్పెను. కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. సభ మఱల నిశ్శబ్దత వహించినది. కామేశ్వరి కాయానంద మొకవిధమైన మతిభ్రమణకం గారణమయ్యెను. అందఱుఁ దనివితీఱ కరతాళధ్వనులు చేసి చాలించిన నీమె చేయుచునే యుండెను. సభాస్తారులెల్లరుఁ బ్రగ్రీవమువైపు చూచుచుండిరి. చివఱకు ప్రక్కనుండువారి బలవంతముచే నా కామేశ్వరి జాగృతయయ్యెను.

కళాప్రియుఁడైన షాజహాన్ జగన్నాథుని కావ్యవాహినిలోఁ దేలియాడుచుండెను. ఆ కవిత్వములో కోకిలా

స్వరములు గూడుకట్టుకొన్నవి. మధుర భావములు తాండ
వించెను. పాండితీప్రకర్ష పరాకాష్ఠ నందుకొన్న దనవచ్చు.
మొగలుసామ్రాజ్య కీర్తిలత పుష్పించినది. కవితారసమునం
దన్మయుఁడైన షాజహాన్ "జగన్నాథకవీ! నిన్ను లోక
మేనాఁడో కవిరాజవని పొగడెను. నేనీ శుభసమయములో
నీకు 'పండితరాయ' బిరుదము నొసంగుచున్నాను. మీ కవితా
మృతము నోఁచుకొన్న మా చరిత్ర కమరత్వము తథ్యము.
మీ ఋణము నక్షుంలక్ష లిచ్చినఁ దీర్చుకోలేము. నా యీ
బిరుదము నంగీకరించి ధన్యుఁ గావించుము. నా కదియె పది
వేలు" అనుచుఁ గొన్ని సహస్రములు స్వర్ణనిష్కముల
నొసంగెను. వాని నన్నింటిని స్వీకరించి, మధురగంభీరస్వర
ముతో జగన్నాథుఁడు "ప్రభూ! తమ యీ యున్నత సత్కా
రమునకుఁ గృతజ్ఞుఁడను. మణివలయన్యాయముగ మీ వలన
నా కవితాపాండిత్యములకు, నా కవితాపాండిత్యములవలన
మీకు శాశ్వతకీర్తి చేకూరినఁ జేకూరవచ్చు. ఎందఱు
రాజులు లేరు. కళాభిమాన మందఱ కెట్లు లభించును? అది
పూర్వజన్మానుభూతి. తా మొసఁగిన పండితరాయ బిరుదము
భారమే యయినప్పటికి మీ సంతృప్తికై స్వీకరించుచున్నా"
నని ప్రత్యుత్తరించినాడు. సభ సమాప్తమైనది. కామేశ్వరి
తదేకదృష్టితో జగన్నాథుఁ జూచుట కా యవనిక యడ్డము
వచ్చెను. దానిఁ దొలఁగించి చూడ మొదలిడినది. అంతః
పురస్త్రీలు కామేశ్వరిని మోహపరవశురాలుగఁ దలఁచి చటా
లున లోపలికి వెళ్లిరి. కామేశ్వరీ హృదయక్షేత్రములో సప్త

సముద్రము లోకుక్కమ్ముడి నానందరసరూపమునం బొంగు లెత్తినవని యుత్ప్రేక్షించుట యుక్తియుక్తమేమో!

---

౮

షాజహాన్ ముంతాజ్ మహాలులకు నలుగురుపుత్రులు. దారా, షుజా, ఔరంగజేబ్, మురాద్‌బక్ష్. జ్యేష్ఠుండైన దారా సాహిత్యోపాసకుండు, రసికచక్రవర్తి, వేదాంతి. సంస్కృతము బాగుగ చదివినాడు. ఉపనిషత్తుల ననువదించెను. 'సూఫీ' వేదాంతమార్గ మవలంబించినాడు. గొప్ప నైతికసంపత్తిగల వ్యక్తి. రాజకీయజ్ఞుండుగ, మహావీరుండుగ పేరెన్నికం గనలేదు. ఆయనతోం బండితరాయలకు మిక్కిలి స్నేహము. దేహములు వేఱు. ఆత్మలు కలసిపోయినవి. ఒకరిని విడచి యొకరుండంజాలకుండిరి.

కామేశ్వరి మొగలు రాజాంతఃపురములో లవంగి యను ప్రచ్ఛన్న నామధేయముతో సంచరించుచుండెను. శుద్ధాంతములో నామె నాట్యమునుగుఱించి ఘనముగం జెప్పుకొనుచుండిరి. జగన్నాథున కట ఘోషాలేదు. దారాతో కలసి యొకనాండు లవంగి నాట్యముం జూచుట తటస్థించెను. ఆ బింబాధరోష్ఠకంపనములో, హావ భావ లీలా నటనానురూప చతురారాజీవయుగళములో, లయానువృత్త పాదతాళ ప్రహారములో, ముద్రాభినయములో తొణికిసలాడు నాట్య రసస్రవంతులా కవిరాజును ముంచి తేల్చినవి. ఈ నాట్య మనుభూతపూర్వమని యంతర్వాణి ప్రబోధించినది, పర్యా

త్సుకుఁ డైనాడు. లవంగీ స్నేహ మపేక్షించెను. అదెంతటి భాగ్యము?

మాటలు కలిసినవి. స్నేహ మధికమైనది. మనస్సు లైక్యమైనవి. ఒకరి పూర్వచరిత్ర నొకరు కనుఁగొన యత్నింపలేదు. లవంగి కంతయుఁ దెలియును. జగన్నాథు నకుఁ దెలియదు. ఆ ప్రేమరసముగ్ధులు నిత్యానందముతో రెండు వసంతములు కాశ్మీరములోఁ గడపిరి. వారి యానం దము వర్ణనాతీతము. ఆ గాఢపరిష్వంగములలో, పరస్పరాను రాగరక్తిమములో - కౌముదీరాత్రు లేమి, నవప్రభాత సౌం దర్య లగ్నము లెన్నో సుఖప్రవణము లైనవి. లవంగి యవ నాంగన యనియు, నామెతో జగన్నాథుఁడు స్నేహమొనర్చి నాడన్న యపవాదము వీరి ప్రేమ వలె గాఢముగ దేశ ములో వ్యాపించెను. షాజహాన్, ముమ్తాజులు, దారా యందుల కావంతయుఁ జింతింపలేదు. సంతోషించిరి కూడా!

మానవుని జీవితము బుద్బుద ప్రాయము. ముమ్తాజ్ మహాల్ పదునాలుగవ కాన్పు షాజహాను హృదయముపై సమ్మెటపోటువంటి దయ్యెను. ఆమె పరలోకగతురాలైనది. షాజహాన్ జీవచ్ఛవమైనాడు. ఎడతెగని కన్నీటిధార. సంతో షము మందునకైన లేదు. రాజ్యమునకు సంబంధించిన యాలోచనలే రావు. కళల నభిమానించుటకు సైతి మిష్ట పడఁడు. తన యంచాలరాణికి శాశ్వత స్మారకచిహ్న మేర్పఱచవలెనని తలంపు. దేశమంతయు చాటించెను. శిల్పుల నందఱ రప్పించినాడు. 1632-వ సం॥న ఆగ్రావద్ద

ముమ్తాజ్ మహల్ దేహావశిష్టములపై బ్రహ్మాండమైన భవనమును నిర్మింప నాజ్ఞాపించెను. అదియొక యద్భుత కళాసృష్టి. సామ్రాజ్యకోశాగారస్థిత ధనమంతయు వెచ్చించినాడు. మూఁడు సంవత్సరములలో పూర్తి యయినది. అదియె తాజ్ మహల్. రాజ్యభారమంతయు కొడుకులపై వదలినను నామకార్థము చక్రవర్తి.

అయిదు సంవత్సరము లెంతయొ ప్రేమానురాగముతోఁ గూడియున్నను జగన్నాథుఁడు గుఱుతింపలేదు. ఆమె నిజమావిష్కరింపఁ దలఁచెను. ధైర్యము చాలలేదు. ఇంత దేశ మొంటరిగ వచ్చుటచేఁ దన శీలము శంకించునేమో? ఇది యొక విషమ సమస్యగా మాఱినది. ఉపాయము తోచలేదు. ఓపికపట్టి యథాప్రకార మాఁజగన్నాథునితోఁ బ్రణయసామ్రాజ్య మేలుచుండెను. అత్తిమామలఁ దలఁచుకొన్న పుట్టెడు దుఃఖము! ఏమిచేయఁగలదు? సమయమునకై కాచుకొనియున్నది. అసూయాపరులైన పండితులు జగన్నాథుని నిందించిరి. 'ఎంత గొప్పపండితుఁడైననేమి, నీచసాంగత్యమా? పండితగౌరవమునకె కళంకముఁ దెచ్చినా' డని చాటసాగినారు. ఆ విమర్శలకుఁ బండితరాయలు జంకలేదు. 'ప్రేమ పవిత్రవస్తువు. దానికిఁ గులగోత్రములు లేవు. సృష్ట్యాదినుండి వచ్చుచున్న సాంప్రదాయ మంతయె. నాకు బహిష్కారముఁ బెట్టువారలను నేనే బహిష్కరించుచున్నాను. నా పాండిత్యమున కసూయ జనించినవారె యిట్లు చెప్పుచున్నారు. ఈ విధానముతో సంఘమును సంస్కరింపఁ

బూనుకొందును.' అని జగన్నాథుఁడు వ్యాఖ్యానింప సాగి నాఁడు. ప్రపంచప్రవాదమున కేమాత్రము కలఁగలేదు.

దారా అస్సాము నేలుచున్న అహోమ్ రాజుపై దాడి వెడలెను. యుద్ధమొనర్ప నపేక్షకలిగి జగన్నాథుఁడును బయలుదేఱినాఁడు. రెండు సంవత్సరములు ఘోరయుద్ధము జరిగినది. అహోమ్ రాజు తుద కోడిపోయెను. 1638-సం వత్సరములో అస్సాముపై మొగలు సామ్రాజ్యపతాక మెగి రినది దారా. పండితరాయలు విజయగర్వముతో ఢిల్లీ కేతెంచిరి. ఘనమైన స్వాగత మొసఁగఁబడెను. జగన్నా థుఁడు కవి, పండితుఁడె గాక – మహావీరుఁడుగ స్తుతింపఁ బడెను. రెండు వత్సరముల రణదీక్షతో నాతఁడు వీరయో ధునివలె తయారయ్యెను. మహారాజకళ లతనిలో పెంపిరి వోయినవి. విశాల వక్షము, పిడితిరిగిన మీసములు, మెడ లపై వ్రాలు జుత్తు, తలపాగా, తురాయి, విలువైన వస్త్రా భరణాదుల నొప్పియుండెను. ఆ వేషమును వదలక విజయ గర్వముతో లవంగిని దర్శింప శుద్ధాంతముఁ బ్రవేశించినాఁడు. ప్రియుని రాకకై ప్రవేశద్వారములోఁ గాచుకొనియున్న లవంగి యొక్క కౌఁగిలితోఁ దన యానందముఁ బ్రకటించి వీరకంకణముఁ దొడుగఁ బోయెను. జగన్నాథుఁడు కంకణముఁ బరిశీలించి లవంగి భుజముపైఁ జేయివేసినాఁడు. ఆ వీరకంక ణము తన యింటిలోనిదే! అంతయు మనోగతమయ్యెను. "నీవు నిజముగ యవనాంగనవేనా?" అని ముంగురుల దువ్వ "మహాపండితులు. వ్యాఖ్యాన మనవసరము" అనుచు

సతని దేహము చాటున కొరిగెను. వారి ప్రేమాత్మకహృద యములలో నానందసాగరము లుప్పొంగినవి. ప్రణయ పవిత్రత కన్నులకుఁ గట్టెను. సంశయార్థ సంభృత జీవితము లొక నిశ్చితార్థమునకు వచ్చినవి.

లవంగి యీదార్ఢ్య మందఱకుఁ దెలిసిపోయినది. నే డామె హైందవసుందరి. ఆ సుందరవదనారవిందములో జీవన సౌభాగ్యకాంతులు వెలారినవి. మొగలురాజకుటుంబ మా దంపతుల గౌరవించెను. లోకము సహింపఁగలదా? ఒక వైపు పాండిత్య ప్రకర్ష. మఱొకవైపు మొగలు సామ్రాజ్యా స్థాన గౌరవము. అందుచే జగన్నాథునిపై పండితు లసూ యాగ్రస్తులైరి. పండితరాయల కళంకముకె ప్రచారము. గుణములు శీఘ్రముగఁ బ్రచారమునకు రావు. దోషములు త్రుటిలో, బ్రపంచవ్యాప్తి నందును. ఆదర్శపురుషునిలోఁగల దోషము జనుల కొక వింత కథ. ఆ సాంప్రదాయమునకు జగన్నాథుఁడు సైతము లొంగిపోయినాడు. కామేశ్వరి యత్తమామల దీనావస్థను వర్ణించెను. స్వాప్నిక జగత్తు నుండి బయటపడువానివలె నైనాడు. పండితరాయలు ప్రియావిరహవేదనాభరితుఁడైన షాజహాతో సెలవు గైకొన్నాడు. పునస్సమాగమమునకు వాగ్దానమొసఁగి దారా తో ననుజ్ఞాతుఁ డయ్యెను. స్వర్ణ నిష్కములను వస్త్రాభర ణాదులను దరిద్రముడుగున ట్లొసఁగి కవిరాజును మొగలు రాజులు సాగనంపిరి.

తనపైఁ బండితులు పెట్టిన యపవాద మర్థరహితమని

లోకమునకుఁ జాటఁ దలఁచెను. భార్యా సహితముగఁ దీర్థ యాత్రలును జేయు కోరిక, అటనటఁ దీర్థములఁ గ్రుంకు లిడుచు వారణాశిఁ జేరిరి. గంగా స్నానమొనర్చి, విశ్వనాథా ర్చనఁ గావించినారు. పండితసభను సమావేశపఱచి తన నిర్దోషిత్వము జగన్నాథుఁడు స్పష్టపఱచినాడు. ఈర్ష్యాళువులు సమ్మతింతురా? మఱొక మార్గమున జగన్నాథుని లొంగ దీయుట యసాధ్యము. యవనాంగనా సహవాసదోష మాతని పాండిత్యమునకుఁ గళంకము గలిగించునని వారి యూహ! అందుచే సమ్మతింపరైరి. తుదకు జగన్నాథుఁడు విసిగి "నే నొక సంఘ సంస్కర్తను, అంతర్వర్ణ వివాహములు శాస్త్ర సమ్మతములే! మీ బహిష్కారము నన్నేమి చేయఁ గలదు? హృదయములేని మీతో ఘోషింపనేల?" అని పండితులఁ దిరస్కరించినాఁడు. ఆ ఆవేశములో గంగా స్తోత్రము నాశువుగఁ జెప్పెను. ఆతని కవిత్వమున కిది నికష ప్రాయము. జగన్నాథుని కీర్తితోఁబాటు కళంకముగూడ ప్రపంచము నావరించుకొనుచుండెను. గ్రామోన్ముఖుఁ డైనాడు.

---

౯

మహైశ్వర్యంబుతో, జగద్విఖ్యాతితో, భార్యా సమే తముగ వచ్చి జగన్నాథుఁడు తల్లిదండ్రులకు, నత్తమామలకు సాష్టాంగ నమస్కారము లొనర్చెను. ఆశతవృద్ధుల వాంఛలు ఫలించినవి. ఆనంద వాహినిలో నోలలాడుచు రాత్రి కనుఁ

గూర్చిన పేరుభట్టునకు పూరి క్షేత్రములోని స్వప్నము పునరావృత్తమైనది. "జగన్నాథుఁడు భారత సారస్వతాకాశములో ధ్రువతార కాఁగలఁడు." ఆనందాశ్రుపూర్ణ నయనుఁడై తన జన్మ ధన్యమైనట్లు తలపోసెను. కొంతకాలము కూచిపూడిలో గడిపి, ముంగొండకుఁ బయనమైరి.

మాతా పితృ సేవచేయుచు, కామేశ్వరీ ప్రణయ రాగ ముగ్ధుఁడై శాంతితోఁ గాలము గడపుచుండెను. ఆ ప్రశాంత వాతావరణములో జగన్నాథుఁ డనేక కావ్యములు రచించెను. అందుఁ గొన్ని కాలగర్భములో లీనమైనవి. కొన్ని రచనలు శాశ్వతస్థాయి నందుకొన్నవి. నాఁటి సంఘములో వ్యక్తిగత విమర్శకుఁ బాత్రుఁడైన, నాతని కావ్యములు మాత్రము సద్విమర్శకుఁ బాత్రములైనవి. ఆతఁడు మున్నాటికిని భారత సారస్వతాకాశములో ధ్రువ తారయే! ఆంధ్ర ప్రతిభను భారత ఖండములోఁ జాటించిన మహామహుఁడు! జగన్నాథుని కావ్య ప్రసూనములు నేటికిని నెత్తావుల విరజిమ్ముచుండును. ఆంధ్రజాతికిఁ బండితరాయలు చేసిన మహోపకారము వర్ణనాతీతము. గైర్వాణికి నతని రచన లలంకార ప్రాయములు. ఆంధ్రజాతికి జగన్నాథుని చరిత్ర యాదర్శమగుఁగాక!

---